శ్రీః

శ్రీమన్నిగమాన్తదేశికప్రణీతమైన

# అభీతిస్తవము



సంపాదకుడు

**రా మో రా**

4-103, I.L.T.D. Colony, Extn., Kothapet,

CHIRALA - 523 157, Cell : **94401 15411**

శ్రీః

శ్రీమన్నిగమాన్తదేశికప్రణీతమైన

# అభీతిస్తవము






సంపాదకుడు

**రా మో రా**

4-103, I.L.T.D. Colony, Extn., Kothapet,

CHIRALA - 523 157, Cell : **94401 15411**

శ్రీః

శ్రీమన్నిగమాన్తదేశికప్రణీతమైన

# అభీతిస్తవము

ప్రథమముద్రణ :- 15.01.2008
ప్రతులు : 500
పేజీలు : 100
వెల రూ. : 25-00

 **RAVI MOHANA RAO,** M.Sc., M.A. (Sanskrit)
Lecturer, V.R.S.& Y.R.N. College, Chirala - 523 157
**Residence :**
4-103, I.L.T.D. Colony, Extn.,
Kothapet, Chirala.
Cell: **94401 15411**

ప్రతులకు : శ్రీమతి ఈ.జయలక్ష్మి
18-3-58/7
శాంతినగర్, కె.టి.రోడ్,
**తిరుపతి - 517 507**

***Computer Setting :-***
**J. RAJA**
Cell : 98483 90564

***Printed at :-***
**Sowmya Offset,**
CHIRALA.

# ముందుమాట

కవితార్కికకేసరి, సర్వతంత్రస్వతంత్ర, వేదాంతాచార్యేత్యాది అన్వర్థబిరుద భూషితులై, శతాధికగ్రంథకర్తలై, విశిష్టాద్వైతసిద్ధాంతప్రవర్తకులలో ప్రముఖులైన వేదాంత దేశికులు రచించిన కృతులలో ముప్పైకిమించిన సంఖ్యలో స్తుతులున్నాయి. ఇవి పలు ప్రక్రియలలో రచింపబడ్డాయి. దయాశతకంలో నూఱుశ్లోకాలు, యతిరాజసప్తతిలో డెబ్బైకి మించిన శ్లోకాలు, వరదరాజపంచాశత్‌లో, దేవనాయక పంచాశత్, గరుడపంచాశత్‌లలో యాభైశ్లోకాలు, న్యాసవింశతిలో ఇరవైశ్లోకాలు - ఈవిధంగా సంఖ్యాపరమైన వైవిధ్యాన్ని, గరుడదండకంలో దండకప్రక్రియ, రఘువరగద్యలో గద్యప్రక్రియ- అనే ప్రక్రియావైవిధ్యం, అచ్యుతశతకం ప్రాకృతభాషలో -అనే భాషావైలక్షణ్యం -వీటిని అన్నిటినీ గమనిస్తే దేశికుల స్తుతుల్లోని వైశిష్ట్యం ప్రస్ఫుటం అవుతుంది. ఇటువంటి దేశికస్తుతుల్లో అభీతిస్తవం ఒకటి. ఇది శ్రీరంగంలోని శ్రీరంగనాథుణ్ణి ఉద్దేశించి రచింపబడింది.

ఈ స్తుతికి అభీతిస్తవమనే పేరు ఎందుకు వచ్చిందనే విషయాన్ని గమనించవలసి ఉన్నది. కృతుల పేర్లు వాటిలో ప్రతిపాదింపబడ్డ విషయాన్నిబట్టి, స్తుతింపబడ్డ దేవతనామాన్నిబట్టి, వాటిప్రారంభంలో ప్రయోగింపబడ్డ పదాలనుబట్టి ఏర్పడతాయన్నది తెలిసినదే. ప్రకృతంలో ఈస్తుతి "అభీతి రిహ" అని "అభీతి" పదంలో ప్రారంభం కావడాన్నిబట్టి దీనికి అభీతిస్తవమని పేరు వచ్చిందని చెప్పవచ్చు. ఈప్రక్రియను కూరేశుల అతిమానుషస్తవం, జితంతే స్తోత్రం మొదలైనవాటిలో చూడవచ్చు. ఈ స్తవంలో ప్రధానంగా ప్రతిపాదింపబడ్డ విషయం అభీతిప్రార్థన కాబట్టి, దీనికి ఈ పేరు వచ్చిందని భావించడంలోను విప్రతిపత్తి లేదు.

ఇక, శ్రీవైష్ణవస్తోత్రాలు అన్నీ ద్వయమంత్రార్థ ప్రతిపాదకాలనే సిద్ధాంతం సర్వత్ర అన్వయించుకోవచ్చు. "శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయనమః" అనే ద్వయమంత్రం పరమవైదికం. కఠవల్లీగతం. శరణాగతి, ప్రపత్తిన్యాసాదిశబ్దాలచేత చెప్పబడే చరమోపాయాన్ని తెలిపేది. లక్ష్మీదేవితో కూడిఉండే నారాయణుని పాదాలను శరణాగతి చేస్తున్నాను, ఆ లక్ష్మీపతికైంకర్యమే పరమప్రాప్యం అన్నది ఈమంత్రంలో ప్రతిపాదింపబడ్డ సారార్థం. ఈ అర్థమే అభీతిస్తవంలోకూడా అనుసంధింపబడింది అనే విషయాన్ని "శ్రియః పరిబృఢే" అనే 21వ శ్లోకవ్యాఖ్యానంలో గమనించవచ్చు. శరణాగతి ఫలం భాగవతకైంకర్యపురస్సరమైన భగవత్కైంకర్యం. ఈ అంశం "పరస్పరహితైషిణాం పరిసరేషు మాం వర్తయ" ఇత్యాది ప్రయోగాల్లో ప్రతిపాదింపబడింది. ఈ శరణాగతి ఆచార్యముఖంగా చేయాలనే అంశం. "సమర్పితోऽయం జనః" (21) ఇత్యాది ప్రయోజనాల్లో సూచితం. ఆ రీతిలోనే లక్ష్మీపురుషకారత్వం "శ్రియః పరిబృఢే" (21), "రమాసఖమ్" (1) "శ్రియాధ్యుషితవక్షసః" (2) ఇత్యాది ప్రయోగాలలో తెలుపబడింది. క్లుప్తంగా చెప్పాలంటే ఈ స్తోత్రంలో ద్వయమంత్రార్థం సర్వత్ర అనుసంధింపబడినదనడం యుక్తం. వేఱే రీతిలో, అంటే,

స్తుతిలోని శ్లోకాల సంఖ్యనుబట్టికూడా ద్వయమంత్రం నిర్దేశింపబడినదనవచ్చు. ద్వయమంత్రంలో "షట్పదోఽయం ద్విఖండః" అనే రీతిలో రెండు వాక్యరూపాలైన ఖండాలు కల్గినది కాబట్టి ద్వయ మనబడుతున్నదని, ఉపాయ- ఉపేయాలు రెండూ క్రమంగా పూర్వోత్తరవాక్యాలలో ప్రతిపాదింపబడుతున్నాయి కాబట్టి ద్వయ మనబడుతున్నదని, రెండు వాక్యాల్లో లక్ష్మీ-నారాయణరూపమైన ద్వయం ప్రస్తుతం కాబట్టి ద్వయమనబడుతున్నదని - ఈవిధంగా ద్వయనామసార్థక్యాన్ని పెద్దలు పలు రీతుల్లో వివరించారు. ప్రస్తుతస్తుతిలోని శ్లోకసంఖ్యను గమనిస్తే- అది 29 అని గుర్తించవచ్చు. ఈ సంఖ్యలోని అంకెలను అంటే - 2,9 అనే అంకెలను కలిపితే 11 అవుతుంది. మళ్ళీ ఈ సంఖ్యలోని అంకెలను రెండిటినీ కలిపితే 1+1=2 అవుతుంది. ఈరీతిలో ఈస్తుతిలోని శ్లోకసంఖ్య ద్వయాన్ని సూచిస్తున్నది. కాబట్టి ఇది శబ్దతః, అర్థతః ద్వయాన్ని తెలుపుతున్నదనడంలో అనౌచిత్యం లేదుకదా !

తురుష్కులు శ్రీరంగాదిక్షేత్రాలపై దండెత్తి, పలువిధాలైన విధ్వంసకాండలను చేసిన విషయం చరిత్రప్రసిద్ధం. భగవద్రామానుజుల శ్రీభాష్యానికి శ్రుతప్రకాశికాభట్టర్ రచించిన శ్రుతప్రకాశికా అనే అపూర్వవ్యాఖ్యను వారిబారినుండి కాపాడడంకోసం దేశికులుపడిన శ్రమకూడ ప్రసిద్ధమే. శ్రీరంగం తురుష్కయవనాద్యాక్రాంతమై, తత్కారణంగా శ్రీరంగనాథుని నిత్యసేవాభాగ్యం లోపించినందువల్ల తమవంటి సత్పురుషులకు, సిద్ధాంతానికి కల్గిన భీతిని పోగొట్టి రక్షించవలసినదిగా దేశికులు ప్రార్థించడమే ఈస్తుతిలోని ప్రధాన ప్రతిపాద్యం. "చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున, అర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ" అని చెప్పబడ్డ రీతిలో పలు ప్రయోజనాలను ఆశించి శరణాగతిని చేయవచ్చు. ఆ రీతిలో దేశికులు తురుష్కయవనాదులవల్ల ఏర్పడిన భయం తొలగి, ప్రశాంతత ఏర్పడాలనే తాత్కాలిక ఫలాన్ని దృష్టిలో పెట్టుకొని ఈస్తుతిలో చేసిన ప్రపత్తి చివరకు భగవద్భాగవతకైంకర్యంలోకిపర్యవసిస్తున్నదన్న విషయం గమనార్హం. కూరేశులుకూడ సుందరబాహుస్తవంలో చివర "శ్రీరంగశ్రియ మన్వహం ప్రగుణయన్ త్వద్భృక్తభోగ్యాం కురు ప్రత్యక్షం సునిరస్త మేవ విదధత్యత్ ప్రత్యర్థినాం ప్రార్థనమ్", అని అంటూ ప్రార్థించడాన్ని కూడా చూడవచ్చు.

ఈ స్తుతిలోని శ్లోకాలన్నీ పృథ్వీవృత్తనిబద్ధాలు కావడం ఇంకోవిశేషం. "జ సౌ జసయలా వసుగ్రహయతి శ్చ పృథ్వీగురుః" అని ఈవృత్తలక్షణం. అభీతిస్తవానికి సంస్కృతంలో గార్గ్యవేంకటాచార్యవిరచితమైన వ్యాఖ్యానం, మణిప్రవాళంలో శ్రీశైలకుల తిలక, చతుర్వేద శతక్రతు, శిన్నాము శ్రీరంగనాథార్యుల వ్యాఖ్యానం ఉన్నాయి. ఇవి రెండూ ఇప్పటికి సుమారు 95 సం॥లకు పూర్వం కుంభకోణంలో గ్రంథిలిపిలో, ద్రావిడలిపిలో ముద్రింపబడ్డాయి. గార్గ్యరామానుజాచార్యులవారి సంస్కృతవ్యాఖ్యను, అద్భుతమైన, తమకే సాధ్యం అయిన సంజీవనీవ్యాఖ్యతోపాటు సుప్రసిద్ధ విద్వాంసులు, వ్యాఖ్యాతృచక్రవర్తులు, ఉవే.శ్రీమాన్ కే.వి. రాఘవచార్యస్వామివారు తిరుమల ఛారిటబుల్

ట్రస్టుద్వారా ఈఏడు ఫిబ్రవరిలో పునః ముద్రించారు. మణిప్రవాళవ్యాఖ్యను గూర్చి, అందులోని విశేషాలనుగూర్చి తెలిసేఅవకాశం లిపిక్లేశంవల్ల, భాషాక్లేశంవల్ల ఆంధ్రపాఠక లోకానికి లేదు.

శ్రీరంగనాథాచార్యులవారి మణిప్రవాళవ్యాఖ్యలో పలు విశేషాంశాలున్నాయి. శఠకోపసూరి రచించిన సహస్రగీతి (తిరువాయ్‌మొళి) ప్రబంధప్రమేయాన్ని దృష్టిలో పెట్టుకొని, దేశికుల స్తుతిగ్రంథాల పౌర్వాపర్యాన్ని వివరిస్తూ, వ్యాఖ్యాత ఈ అభీతిస్తవంలో దేశికులు తురుష్కయవనాదులవల్లకల్గిన ఉపద్రవంనుండి శ్రీరంగాన్ని, లౌకిక విషయాల వల్ల కల్గిన ఉపద్రవంనుండి తమను రక్షించవలసినదిగా ప్రార్థించారని పలు శ్లోకాల వ్యాఖ్యలో సందర్భానుసారంగా వివరించడం గమనించతగ్గది. అంతేకాక, 18వ శ్లోకవ్యాఖ్యలో దేశికుల అనుభూతిని శఠకోపసూరి ప్రబంధంలోని అనుభూతితో సమన్వయిస్తూ, దేశికులు శఠకోపసూరివలె నాయికాభావనను పొంది, ఈ శ్లోకాన్ని రచించారని నిరూపించడం, లంకలో రాక్షసస్త్రీలమధ్య బాధపడే సీతాదేవితో సామ్యాన్ని ప్రతిపాదించడం మొదలైనవి వ్యాఖ్యాత సామర్థ్యానికి గీటురాళ్ళు. ఆ రీతిలోనే, 20వ శ్లోకంలో "శమయ" అనే క్రియారూపాన్ని "ప్రభో" అనే సంబోధననుబట్టి లోట్ రూపంగా గ్రహించాలనే స్వారస్యంకూడా ఇందుకు ఇంకో తార్కాణం.

ఇటువంటి పలు స్వారస్యాలున్న ఈ మణిప్రవాళవ్యాఖ్యను ఆంధ్రీకరించి ఆంధ్రపాఠక లోకానికి సమర్పించాలనే ఆశతో ఈ అనువాదప్రయత్నాన్ని చేశాను. నా అనువాదాన్ని చూచినవెంటనే ముద్రించడానికి ముందుకు వచ్చిన సహృదయులు, సారస్వతప్రియులు, ప్రత్యేకించి సంస్కృతభాషావ్యాప్తికై పలు అపూర్వ- అముద్రిత గ్రంథాలను నిస్స్వార్థంగా ప్రచురించిన చీరాలవాస్తవ్యులు మిత్రవర్యులు, శ్రీరావి మోహనరావుగారికి నేను ఎంతో ఋణపడిఉన్నాను. వీరు నాపట్ల చూపించే ఆదరానికి, సదా నాకు ఇస్తున్న ప్రోత్సాహానికి నేను హార్దంగా, ఆర్ద్రంగా చేతులను జోడించి నమస్కరించడంకంటే చేయగల ఇంకొక ప్రత్యుతకృతి లేదన్నది వాస్తవం. నన్ను సర్వదా ప్రోత్సహించి, ఆశీర్వదించే తల్లిదండ్రులు ల.స.సీతమ్మగారు, న్యాయవేదాంతవిద్వాన్ ఉవే.శ్రీమాన్ శ్రీరంగాచార్యస్వామివారికి సవినయంగా ప్రణమిల్లుతున్నాను. ఈగ్రంథాన్ని డి.టి.పిచేసి, సహకరించిన శ్రీమతి జయగారిని మనఃపూర్వకంగా ఆశ్వీరదిస్తున్నాను. అనువాదంలో దొర్లిన దోషాలు నా అజ్ఞానప్రమాదకృతాలుగా భావించి, క్షమించమని సహృదయపాఠకులను వేడుతూ సెలవు తీసికొంటున్నాను.

ఇట్లు,

తిరుపతి, సహృదయవిధేయుడు

30.11.07. ఈ.వి.శింగరాచార్యులు

# అభీతిస్తవము

అభీతి రిహ యజ్జుషాం యదవధీరితానాం భయం
భయాభయవిధాయినో జగతి యన్నిదేశే స్థితాః ।
తదేతదతిలంఘితద్రుహిణశంభుశక్రాదికం
రమాసఖ మధీమహే కిమపి రంగధుర్యం మహః ॥ 1 ॥

దయాశిశిరితాశయా మనసి మే సదా జాగ్రయుః
శ్రియాఽధ్యుషితవక్షసః శ్రితమరుద్వృథాసైకతాః ।
జగద్దురితఘస్మరా జలధిడింభడంబస్పృశః
సకృత్ప్రణతరక్షణప్రథితసంవిద స్సంవిదః ॥ 2 ॥

యదద్య మితబుద్ధినా బహుళమోహభాజా మయా
గుణగ్రథితకాయవాఙ్మనసవృత్తివైచిత్ర్యతః ।
అతర్కితహితాహితక్రమవిశేష మారభ్యతే
తదప్యుచిత మర్చనం పరిగృహాణ రంగేశ్వర ॥ 3 ॥

మరుత్తరణిపావకత్రిదశనాథకాలాదయః
స్వకృత్య మధికుర్వతే త్వదపరాధతో భీభృతః ।
మహ త్కిమపి వజ్ర ముద్యత మివేతి యచ్ఛ్రూయతే
తరత్యనఘ తద్భయం య ఇహ తావకస్తావకః ॥ 4 ॥

భవంత మిహ య స్స్వధీనియతచేతనాచేతనం
పనాయతి నమస్యతి స్మరతి వక్తి పర్యేతి వా ।
గుణం క మపి వేత్తి వా తవ గుణేశ గోపాయితుః
కదాచన కుతశ్చన క్వచన తస్య న స్యాత్ భయమ్ ॥ 5 ॥

స్థితే మనసి విగ్రహే గుణిని ధాతుసామ్యే సతి
స్మరే దఖిలదేహినం య ఇహ జాతుచిత్ త్వా మజమ్ ।
తమేవ ఖలు సంధయా త మథ దీర్ఘనిద్రావశం
స్వయం విహితసంస్మృతిః నయసి ధామ నైశ్శ్రేయసమ్ ॥ 6 ॥

రమాదయిత రంగభూరమణ కృష్ణ విష్ణో హరే
త్రివిక్రమ జనార్దన త్రియుగ నాథ నారాయణ ।
ఇతీవ శుభదాని యః పఠతి నామధేయాని తే
న తస్య యమవశ్యతా నరకపాతభీతిః కుతః ॥ 7 ॥

కదాచిదపి రంగభూరసిక యత్ర దేశే వశీ
త్వదేకనియతాశయ స్త్రిదశవందితో వర్తతే ।
తదక్షతతపోవనం తవ చ రాజధానీ స్థిరా
సుఖస్య సుఖ మాస్పదం సుచరితస్య దుర్గం మహత్ ॥ 8 ॥

త్రివర్గపథవర్తినాం త్రిగుణలంఘనోద్యోగినాం
ద్విషత్ప్రమథనార్థినా మపి చ రంగదృశ్యోదయాః ।
స్ఖలత్సమయకాతరీహరణజాగరూకాః ప్రభో
కరగ్రహణదీక్షితాః క ఇహ తే న దివ్యా గుణాః ॥ 9 ॥

బిభేతి భవభృత్ ప్రభో త్వదుపదేశతీవ్రౌషధాత్
కదధ్వరసదుర్విషే బడిశభక్షవత్ ప్రీయతే ।
అపథ్యపరిహారధీవిముఖ మిత్థ మాకస్మికీ
త మప్యవసరే క్రమాత్ దవతి వత్సలా త్వద్దయా ॥ 10 ॥

అపార్థ ఇతి నిశ్చితః ప్రహరణాదియోగ స్తవ
స్వయం వహసి నిర్భయ స్తదపి రంగపృథ్వీపతే ।
స్వరక్షణ మివాభవత్ ప్రణతరక్షణం తావకం
యదాత్థ పరమాత్మవి న్నియత మంతరాత్మేతి తే ॥ 11 ॥

లఘిష్ఠసుఖసంగదైః స్వకృతకర్మనిర్వర్తితైః
కళత్రసుతసోదరానుచరబంధుసంబంధిభిః ।
ధనప్రభృతికై రపి ప్రచురభీతిభేదోత్తరైః
న బిభ్రతి ధృతిం విభో త్వదనుభూతిభోగార్థినః ॥ 12 ॥

న వక్తు మపి శక్యతే నరకగర్భవాసాదికం
వపు శ్చ బహుధాతుకం నిపుణచింతనే తాదృశమ్ ।
త్రివిష్టపముఖం తథా తవ పదస్య దేదీప్యతః
కి మత్ర న భయాస్పదం భవతి రంగపృథ్వీపతే ॥ 13 ॥

భవంతి ముఖభేదతో భయనిదాన మేవ ప్రభో
శుభాశుభవికల్పితాః జగతి దేశకాలాదయః ।
ఇతి ప్రథితసాధ్వసే మయి దయిష్యసే త్వ న్న చేత్
క ఇత్థ మనుకంపితా త్వదనుకంపనీయ శ్చ యః ॥ 14 ॥

సకృత్ప్రపదనస్పృశా మభయదాననిత్యవ్రతీ
న చ ద్వి రభిభాషసే త్వ మితి విశ్రుత స్స్వోక్తితః ।

యథోక్తకరణం విదు స్తవ తు యాతుధానాదయః
కథం వితథ మస్తు తత్ కృపణసార్వభౌమే మయి ॥ 15 ॥

అనుక్షణసముత్థితే దురితవారిధౌ దుస్తరే
యది క్వచన నిష్కృతి ర్భవతి సాऽపి దోషావిలా ।
తదిత్థ మగతౌ మయి ప్రతివిధాన మాధీయతాం
స్వబుద్ధిపరికల్పితం సపది రంగధుర్య త్వయా ॥ 16 ॥

విషాదబహులా దహం విషయవర్గతో దుర్జయాత్
బిభేమి వృజినోత్తర స్త్వదనుభూతివిచ్ఛేదతః ।
మయా నియతనాథవా నయ మితి త్వ మర్థాపయన్
దయాధన జగత్పతే దయితరంగ సంరక్ష మామ్ ॥ 17 ॥

నిసర్గనిరవిష్టతా తవ నిరంహసః శ్రూయతే
తత స్త్రియుగ! సృష్టివత్ భవతి సంహృతిః క్రీడితమ్ ।
తథాపి శరణాగతప్రణయభంగభీతో భవాన్
మదిష్ట మిహ య ద్భవేత్ కి మపి మా స్మ తజ్జీహపః ॥ 18 ॥

కయాధుసుతవాయసద్విరదపుంగవద్రౌపదీ-
విభీషణభుజంగమవ్రజగణాంబరీషాదయః ।
భవత్పదసమాశ్రితాః భయవిముక్తి మాపు ర్యథా
లభేమహి తథా వయం సపది రంగధుర్య త్వయా ॥ 19 ॥

భయం శమయ రంగధామ్న్యనితరాభిలాషస్పృశాం
శ్రియం బహుళయ ప్రభో ! శ్రితవిపక్ష మున్మూలయ ।
స్వయం సముదితం వపు స్తవ నిశామయంత స్సదా
వయం త్రిదశనిర్వృతిం భువి ముకుంద ! విందేమహి ॥ 20 ॥

శ్రియః పరిబృఢే త్వయి శ్రితజనస్య సంరక్షకే
సదద్భుతగుణోదధా వితి సమర్పితోऽయంజనః ।
ప్రతిక్షణ మతః పరం ప్రథయ రంగధామాదిషు
ప్రభుత్వ మనుపాధికం ప్రథితహేతిభిః హేతిభిః ॥ 21 ॥

కలిప్రణిధిలక్షణైః కలితశాక్యలోకాయతైః
తురుష్కయవనాదిభిః జగతి జృంభమాణం భయమ్ ।
ప్రకృష్టనిజశక్తిభిః ప్రసభ మాయుధైః పంచభిః
క్షితిత్రిదశరక్షకైః క్షపయ రంగనాథ క్షణాత్ ॥ 22 ॥

దితిప్రభవదేహభి ద్దహనసోమసూర్యాత్మకమ్
తమఃప్రమథనం ప్రభో సముదితాస్త్రబృందం స్వతః ।
స్వవృత్తివశవర్తితత్రిదశవృత్తి చక్రం పునః
ప్రవర్తయతు ధామ్ని తే మహతి ధర్మచక్రస్థితమ్ ॥ 23 ॥

మనుప్రభృతిమానితే మహతి రంగధామాదికే
దనుప్రభవదారుణైః దర ముదీర్యమాణం పరైః ।
ప్రకృష్టగుణకశ్రియా వసుధయా చ సంధుక్షితైః
ప్రయుక్తకరుణోదధే ప్రశమయ స్వశక్త్యా స్వయమ్ ॥ 24 ॥

భుజంగమవిహంగమప్రవరసైన్యనాథాః ప్రభో
తథైవ కుముదాదయో నగరగోపురద్వారపాః ।
అచింత్యబలవిక్రమా స్త్వ మివ రంగసంరక్షకాః
జితంత ఇతి వాదినో జగదనుగ్రహేజాగ్రతు ॥ 25 ॥

విధి స్త్రిపురమర్దన స్త్రిదశపుంగవః పావకో
యమప్రభృతయోఽపి య ద్విమతరక్షణే న క్షమాః ।
రిరక్షిషతి యత్ర చ ప్రతిభయం న కించిత్ క్వచిత్
స నః ప్రతిభటాన్ ప్రభో శమయ రంగధామాదికే॥ 26 ॥

స కైటభతమోరవి ర్మధుపరాగజంఝామరుత్
హిరణ్యగిరిదారణః త్రుటితకాలనేమిద్రుమః ।
కి మత్ర బహునా భజద్భవపయోధిముష్టింధయః
త్రివిక్రమ భవత్క్రమం క్షిపతు మంక్షు రంగద్విషః ॥ 27 ॥

యతిప్రవరభారతీరసభరేణ నీతం వయః
ప్రఫుల్లపలితం శిరః పర మిహ క్షమం ప్రార్థయే ।
నిరస్తరిపుసంభవే క్వచన రంగముఖ్యే విభో
పరస్పరహితైషిణాం పరిసరేషు మాం వర్తయ ॥ 28 ॥

ప్రబుద్ధగురువీక్షణప్రథితవేంకటేశోద్భవాం
ఇమా మభయసిద్ధయే పఠత రంగభర్తుః స్తుతిమ్ ।
భయం త్యజత భద్ర మిత్యభిదధత్స వః కేశవః
స్వయం ఘనఘృణానిధిః గుణగణేన గోపాయతి ॥ 29 ॥



# అభీతిస్తవము

శ్రీమాన్ వేంకటనాథార్య: కవితార్కికేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

యస్యాంగం తపసా కృశం భవ దపి శ్రీతేజసా మాస్పదం
పూర్వాచార్యపరంపరా విజయతే యచ్ఛీర్షసంబంధత: ।
సాంగోపాంగభరార్పణస్య కరణం యేన క్షణాత్ సాధితం
శ్రీశ్రీవాసమునీంద్రదేశికమణిం శ్రేయోనిధిం సంశ్రయే ॥

శ్రితసంతాపశమనం విరోధిభయకారణమ్ ।
శ్రీనివాసమునీశాఖ్యం తేజ: కిమపి సంశ్రయే ॥

శ్రీరంగనాథదాసోఽయం విద్వద్బృందనిదేశత: ।
అభీతిసంస్తుతివ్యాఖ్యాం తనుతే ద్రమిడోక్తిభి: ॥

## అవతారిక

"ఉత్ప్రేక్ష్యతే బుధజనై రుపపత్తిభూమ్నా ఘంటా హరే స్సమజనిష్ట యదాత్మనేతి" అని "ఘంటావతారోఽనంతార్యతనయ:" అని చెప్పబడురీతిలో శ్రీవేంకటేశ ఘంటావతారులుగా, "బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధన:" అని లక్ష్మణునివలె బాల్యమునుండి భగవద్భక్తిని కల్గియుండి, "పాంసుక్రీడాస్వపి హరే: లీలయా కథయాఽపి చ" అను పరీక్షన్మహారాజువలె పాంసుక్రీడలలోకూడ భగవల్లీలలతోనే క్రీడించువారు, "వసిష్ఠవ్యపదేశివ:" అను రీతిలో కిడాంబికులపలతులు అయిన అప్పుళ్ళార్‌కు అంతేవాసులుగానుండి "సకృన్నిగదమాత్రేణ తౌ సంజగృహతు: నృపౌ" అని బలరామకృష్ణులు సాందీపనివద్ద సకృదావృత్తిచేతనే సర్వవిద్యాగ్రహణమును చేసినట్లు "పునరుచ్చారణానాకాంక్షీ పదానాం వేష్టనే పరమ్" అని వేదాధ్యయనమున పదవేష్టనములో మాత్రము పునరుచ్చారణ తప్ప మిగిలిన సందర్భములలో సకృదావృత్తిలో సకలవిద్యలను గ్రహించినవారు వేదాంతదేశికులు. వీరు ఆళ్వార్లవలె భగవత్ సంశ్లేషవియోగములవలన సుఖదు:ఖములను పొందినవారు, ఆళ్వార్లు "తూరా క్కుళి తూర్త్తెన్నై-నాళకన్నిరుప్పన్, కూవిక్కొళ్ళుమ్ కాలమ్ ఇన్నుమ్ కుఱుకాదో" అని దుష్పూరములైన ఇంద్రియముల నడుమ ఎంతకాలము నేను నిన్ను విశ్లేషించియుందును? నీవు నన్ను పిలిచి, దగ్గరకు రప్పించుకొను కాలము ఇంకను రాలేదా ? అనుచు ఆక్రోశించి, శఠకోపులు "ఉలక ముణ్డ పెరు వాయా" అనెడి దశకములో "నాప్రకృతి సంబంధమును తీర్చి, నీ శ్రీపాదములలో చేర్చుకొనవలెను" అని శరణు వేడిరి. తన సంతానము తిండిలేకుండ నున్నపుడు అతిథులకు విందు చేయువారివలె, లోకహితార్థము ఆళ్వార్లను పురస్కరించుకొని ప్రబంధమును పూర్తిజేయింపవలెనని తలచుటచేత, వారి

ప్రాకృతశరీరములో తనకుగల లోభముచేత, వారిని ఈ ప్రకృతిమండలములోనే నిలిపి ఉంచెను. వారును పూర్వమువలె ఇంద్రియముల నడుమ తాముండుటను గమనించి, విషయములచేత బలాత్కారముగా ఆకర్షింపబడువారివలె మిక్కిలి భీతులై, భగవత్సంశ్లేషము లభింపకపోవుటవలన వ్యసనాభిభూతులైరి. "కరణసన్నిధానమును నివర్తింపజేయగల సమర్థుడవైనను నివర్తింపజేయకుండ, వీటితో హింసించి, నీ శ్రీపాదాలవద్దకు చేరలేకుండునట్లు నన్ను చేయుచున్నావు. దీనివలన నీకేమి ప్రయోజన మున్నది'' అనుచు "ఉణ్ణిలావియ" అను దశకములో ఎలుగెత్తి ఆక్రోశించిరి. శ్రీవేంకటేశ్వరునితో తాము సంశ్లేషింపలేని దుఃఖముచేతను, తత్సంశ్లేషప్రతిబంధకమైన ప్రకృతిని గమనించినందున ఏర్పడిన భయముచేతను మిక్కిలిగా భయపడినవారై, పిమ్మట శ్రీరంగములోని రంగనాథస్వామి శ్రీపాదముల చెంతకు చేరి, వానిపై వాలిరి. అయినను తాము స్వామి కటాక్షమును పొందలేక పోవుటచే "కళ్ళులుమ్ పకలుమ్" అనెడి దశకములో పలవరించిరి. ఈ రీతిలోనే "కదా ఘోరకళేబరకారాగారకుహరనిర్గతం కరిష్యసి మామ్", "నిర్వాపయిష్యసి కదా కరిశైలధామన్! దుర్వారకర్మపరిపాక మహాదవాగ్నిమ్", "దుఃఖానుభూతి మపి యే సుఖయన్నివ త్వత్పాదారవిందపరిచార-రసప్రవాహః, గోప్తా స మే భవతు మే గోపపురాధిరాజః" అనుచు అచ్యుతశతకములో, వరదరాజపంచాశత్‌లో, దేహళీశస్తుతిలో అనిష్టనివృత్తిని, ఇష్టప్రాప్తిని ప్రార్థించిరి. అచట తమ మనోరథపూర్తి కలుగకపోవుటచే మఱల శ్రీవేంకటేశ్వరుని పాదముల చెంతకు చేరి, దయాశతకముతో స్తుతించి, "నాతః పరం కి మపి మే త్వయి నాథనీయం మాత ర్దయే మయి కురుష్వ తథా ప్రసాదమ్, బద్ధాదరో వృషగిరిప్రణయీ యథాऽసౌ ముక్తానుభూతి మిహ దాస్యతి మే ముకుందః" అనుచు నిరవధికమహానంద బ్రహ్మానుభూతికుతూహలుడనై నేనుండునట్లు అనుగ్రహింపవలయునని ప్రార్థించిరి. అయినను వీరిని పురస్కరించుకొని ఉపదేశానుష్ఠానములద్వారా, ప్రబంధములద్వారా లోకోపకారమును చేయుటకొఱకు ఈ ప్రకృతిలో ఆళ్వార్లను నిలిపినట్లు, వీరిని కూడా భగవానుడు నిలిపి ఉంచెను. దేశికులును తాము ప్రకృతిలో ఇంద్రియములమధ్య పూర్వమువలె ఉండుటను గమనించి, ఇంద్రియవశ్యులుకాకుండ నున్నను, సర్పములు కఱువకున్నను వాని మధ్య నివసించుట అతిభయంకరమైయుండునట్లే, ఇంద్రియములను చూచి భయపడి, మిక్కిలి దుఃఖముతో అభిభూతులయ్యిరి. పిమ్మట శ్రీరంగములోని రంగనాథుని సన్నిధికి చేరి, ఆస్వామి పాదములలో పడిన తప్ప తమక్లేశము తీరదని భావించిరి. శ్రీరంగమునకు వెడలి "దృష్ట ఏవ హి వ శ్శోక మపనేష్యతి రాఘవః" అని దర్శనమాత్రముననే సర్వక్లేశములును తీరురీతిలో శ్రీరంగనాథుని కన్నులార దర్శించి, అనుభవించలేని రీతిలో తురుష్క,యవనపాషండాక్రాంతమై ఆ క్షేత్ర ముండుటచే "అహ మావారయిష్యామి యుష్మాకం పరిపంథినః, అవ్యగ్రమనసో యూయం మధు సేవత వానరాః" అనురీతిలో పలుకువారెవ్వరును లేకుండుటచే చంటిబిడ్డ తల్లివద్దకు చేరిన పిమ్మటకూడ పాలు తాగలేకపోయి, బాధపడు రీతిలో అతిదుఃఖితులై బాధపడి, "నాకు ప్రకృతిలోనుండుట తప్పని సరి అయినపుడు, భాగవతులతో కలసి కాలక్షేపమును చేసెదను'' అని

ప్రయత్నించిరి. కంసవేనాదుల రాజ్యములలోవలె సాధువులందఱు తురుష్కయవనులచే పీడితులై, ఆక్రందించుచు పారిపోవుటచే, తమకెవ్వరును తోడు లేకుండటనుబట్టి దేశికులు ఏకాకియై, "ప్రియం జన మపశ్యంతీం పశ్యంతీం రాక్షసీగణమ్, స్వగణేన మృగీం హీనాం శ్వగణేన వృతా మివ" అను రీతిలో సహాయకులుగా భక్తు లెవ్వరును లేనివారై పోవుటయే కాక, శ్రీరంగము సైతము తురుష్కయవనాదులచే ఆక్రాంతమై పోవుటచే "ఇరుపాడెరికొళ్ళియినుళ్ళెఱుమ్బుపోలే ఉరుకా నిఱ్కుమ్" అను రీతిలో రెండువైపుల మండు కొఱివికట్టెల నడుమ చిక్కుకొన్నట్లు. ద్రవించిన మనస్సును కలవారై, "హా రామ ! సత్యవ్రత ! దీర్ఘబాహో ప్రియ శ్చ వధ్యాం న మాం వేత్సి హి రాక్షసానామ్" అని పలువురు రాక్షసులచే చుట్టుముట్టబడిన సీతాదేవి ఏకాకినియై ఎలుగెత్తి ఆక్రోశించి, శ్రీరామచంద్రుని పిలచినట్లు, పలు పులుల చేతికి చిక్కిన ఒక కృష్ణమృగమువలె "విషాదబహుళా దహం విషయవర్గతో దుర్జయా ద్బిభేమి" అనునట్లు అతిభయంకరానేక విషయముల బారినపడిన ఏకాకియైన తమను రక్షింపవలెనని, "తురుష్కయవనాదిభిః జగతి జృంభమాణం భయం క్షపయ"అనుచు వారివలన కల్గిన భయమును పోగొట్టి, తమను అనుభవించునట్లు అనుగ్రహింపవలయుననియు, "శాఖామృగా రావణసాయకార్తాః జగ్ముః శరణ్యం శరణంస్మ రామమ్" అని వానరవీరులు శ్రీరాముని శరణుపొందినట్లు దేశికులును ఈస్తుతిప్రబంధములో వాత్సల్యాదిగుణానుసంధాన-పూర్వకముగా, లక్ష్మీదేవీ పురుషకారపురస్సరముగా శ్రీరంగనాథుని శరణు వేడుచున్నారు. ఇట్లు శరణాగతిని చేయుటను "శ్రియఃపరిబృఢే" అనెడి 29వ శ్లోకములో గమనింపవచ్చును. ఇట్లు అభీతిస్తవప్రబంధములో ప్రార్థించిన రీతిలో విరోధులైన తురుష్కయవనాదులను భగవానుడు నిరసింపగా, భగవద్ధ్యానసోపానములో శ్రీరంగనాథుని పాదాదికేశాంతముగా అనుభవించిరనుట ఈస్తుతికి పిమ్మట రచింపబడిన భగవద్ధ్యాన సోపానప్రబంధముతో ఈ ప్రబంధమునకుగల సాక్షాత్సంగతి. ఆళ్వార్లుకూడ భగవద్ విశ్లేషముతో "కఙ్గులుమ్ పకలుమ్" అనెడి దశకములో ఆక్రందించినపుడు భగవానుడు పూర్ణసంశ్లేషమును అనుగ్రహింపగా, "అడియదైయాదాళ్‌పోలివళ్ అణుకి యదైన్దనళ్" అనుచు అనుభవించిరికదా ! అభీతిస్తవము దయాశతకమునకు పిమ్మట రచింపబడిన ప్రబంధమని, భగవద్ధ్యానసోపానమునకు పూర్వప్రబంధమని దేహళీశస్తుతివ్యాఖ్యానావతారికలో విస్తరముగా తెలిపితిమి. అచట గమనింపనగును.

ఇందు, మొదటిశ్లోకములో తమకు అపేక్షణీయములైన విరోధినిరసన-అభయప్రదానాదులు భగవదేకసాధ్యములనుచు దేశికులు మంగళాచరణమును చేయుచున్నారు. "అభీతి రిహ" అనుద్వారా. స్తుతి ప్రబంధప్రారంభమును అకారముతో చేయుట మంగళావహమను విషయము "అ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానమ్..... కిం నామ మంగళం నాచరితమ్" అను మహాభాష్యకారులసూక్తివలన స్పష్టము.



శ్రీమన్నిగమాంతదేశికప్రణీతమైన

# అభీతిస్తవము

అభీతి రిహ యజ్జుషాం యదవధీరితానాం భయం
భయాభయవిధాయినో జగతి యన్నిదేశే స్థితాః ।
తదేతదతిలంఘితద్రుహిణశంభుశక్రాదికం
రమాసఖ మధీమహే కిమపి రంగధుర్యం మహః ॥ 1 ॥

యజ్జుషాం = ఏతేజస్సును ప్రీతితో ఆశ్రయించువారికి, ఇహ = ఈ లోకమున, అభీతిః = అభయము, (కలుగునో), యదవధీరితానాం = ఏ తేజస్సును ఉపేక్షించినవారికి, భయం = భయము (కలుగునో), భయా+అభయవిధాయినః= భయము, అభయమును కల్గించువారు అందఱు, జగతి = లోకమున, యత్+నిదేశే = ఏతేజస్సుయొక్క ఆజ్ఞయందు, స్థితాః= ఉన్నవారో, అతిలంఘిత = దాటబడిన (అతిక్రమింపబడిన), ద్రుహిణ = బ్రహ్మ, శంభు = శివుడు, శక్ర +ఆదికం = ఇంద్రుడు మొదలగువారిని కల్గినది, రమాసఖం = లక్ష్మీదేవికి సఖుడైనది, తత్+ఏతత్ = అట్టి ఈ, కిమపి = విలక్షణమైన, రంగధుర్యం మహః= శ్రీరంగనాథుడను తేజస్సును, అధీమహే = అధ్యయనము చేయుచున్నాము.

శ్రీరంగనాథుడను విలక్షణమైన తేజస్సును అనుసంధించుచున్నామని తాత్పర్యము. ఆ తేజస్సు ఎట్టిదనుటను కొన్ని విశేషణములతో దేశికులు వివరించుచున్నారు.

ఏ తేజస్సును ఆశ్రయించినవారికి, అభయము, ఆశ్రయింపనివారికి భయమును కల్గునో, భయాభయములను కల్గించు వస్తువులన్నియు లోకమున ఏ తేజస్సు ఆజ్ఞకు అధీనములో, బ్రహ్మమొదలగువారికంటె అధికమో, లక్ష్మీదేవితో ఎల్లప్పుడు కలసియుండునది, వేదాంతవేద్యము, శ్రీరంగమున వెల్గునదియు అగు శ్రీరంగనాథుడను విలక్షణమైన తేజస్సును (వేదాధ్యయనమువలె) ఎల్లప్పుడు అనుసంధింతును.

(యజ్జుషామ్) - ఏ తేజస్సును ప్రీతితో సేవించువారికి -అని భావము. "జుషీ -ప్రీతి సేవనయోః" అనునపుడు తెలుపబడిన ప్రీతి, సేవనము రెండర్థములును ఇచట

వివక్షితములే. కేవలము విధి అను భావనతో కాక, ప్రీతితో సేవించువారికి అని తాత్పర్యము.

(ఇహాపి) - అని ఇచట "అపి"ని అధ్యాహారము చేసికొనతగును. పరలోకముననే కాక, ఇచటను- అని భావము.

(అభీతి:) - "భవతి" అని అధ్యాహార్యము. కేవలము భయనాశనమే కాదు. ఇష్టప్రాప్తియును. అనగా రక్షణపూర్తి -అని భావము.

(యదవధీరితానాం భయమ్) - "భవతి" అని చేర్చుకొనతగును. శ్రీరంగనాథుని ఆశ్రయించినవారికి ఏ విధమైన భయమును పరలోకమున, ఈ లోకమునను కలుగదు. స్వామిని ఆశ్రయింపనివారికి అన్నివిధములైన భయములు అన్నిలోకములందును కలుగును -అని తాత్పర్యము. భగవానుని ఆశ్రయించి విభీషణుడు సర్వవిధమైన అభయమును పొందెను. అతనిని ఉపేక్షించిన రావణుడు మరణాంతమైన భయమును పొందెను. లోకమున తేజస్సు తనను ఆశ్రయించినవారికి తాపహేతువు, ఆశ్రయింపనివారికి తాపహేతువు కానేరదు. కాని శ్రీరంగనాథుడను తేజస్సు తనను ఆశ్రయించినవారికి తాపహేతువు ఏనాడును కాదు. ఆశ్రయింపనివారికే తాపహేతువగును. ఇట్లు విలక్షణమైన తేజస్సు అగుటచే దానిని "కి మపి" అని నిర్దేశించిరి. ఇందుచే ఆశ్రితసౌలభ్యము, ప్రతికూలురకు దుర్జయత్వమును తెలుపబడినవి. "సోమవత్ ప్రియదర్శన:" అని తెలుపబడిన శ్రీరాముడేకదా "అభిత: పావకోపమ:" అని నిర్దేశింపబడెను. "తం తాలుమూలం ప్రదహంత మగ్నివత్ గోపాలసూనుం పితరం జగద్గురో:" అని బకాసురుని నోటిలో చిక్కిన కృష్ణుడు అతనికి దుర్జయుడై, తాపహేతువయ్యెను. అట్లే - "సహసోత్థాయ చాభ్యేత్య దోర్భ్యాం పర్యగ్రహీత్ ముదా" అనునట్లు కుచేల -అక్రూరాదులను ఆలింగనము చేసికొనునపుడు ఆనందహేతువయ్యెను. ఇట్లు విరోధినివర్తనమును చేసి, ఆశ్రితులను రక్షించువాడు నన్ను రక్షింపక విరోధుల చేతిలో నన్ను పెట్టుటయా? - "మేము నిన్ను అట్లు విరోధుల హస్తములందు పెట్టితిమా ఏమి?" అని భగవానుడు ప్రశ్నింపగా, విరోధినివర్తనము చేయుటలో సమర్థుడవైనను అట్లు నా విరోధులను నివర్తింపక వారి చేతిలో నన్ను పెట్టినవాడవైతివికదా ! అని దేశికులు పల్కిరని స్ఫురించును. "బాధకత్వైకస్వభావమును కల్గినవగు పదార్థములు బాధింపవా? విషయాదులకు బాధకత్వము స్వభావమేకదా ! నాకు నివర్తింపజేయ సాధ్యమగునా ?" అనినచో అందులకు సమాధానమును రెండవపాదమున కవి పల్కుచున్నారు.

(భయాభయవిధాయినః) - భయమును, అభయమును కల్గించు పదార్థము లన్నియు- అని భావము.

(జగతి యన్నిదేశే స్థితాః) - "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్ర మసౌ విధృతౌ తిష్ఠతః" అనునట్లు సర్వపదార్థములను నీ ఆజ్ఞకు పరతంత్రములై కదా వర్తించును ! ఇట్లు అన్ని పదార్థములును నీ అధీనములోనున్నవై, "విష మప్యమృతం క్వచిత్ భవే దమృతం వా విష మీశ్వరేచ్ఛయా" అనునుట్లు ఒకచో ప్రీతిహేతువైనది భయహేతువుగను, భయహేతువైనది ప్రీతిహేతువుగను నీ సంకల్పవశమున పరిణమించుకదా ! "స త్వాసక్తమతిః కృష్ణే దశ్యమానో మహోరగైః, వ వివేదాత్మనో గాత్రమ్" అనియు, "శీతో భవ హనూమతః" అనియు, "అతియుమ్ శెన్దీయై త్తళువి యచ్చుత నెన్జుమ్ మెయ్ వేవాళ్, పోమిళ వాకత్తిన్ పిన్పోయ్" అనియు ప్రహ్లాద - పవనాత్మజ - పరాంకుశాదులకు సర్వాగ్నులన్నియు అనుకూలముగా పరిణమించెను. అనుకూలమైన పూమాలయు ఇందుమతికి మరణహేతువయ్యెను. ఇట్లుండగా, విషయాదులకు స్వభావమైన బాధకత్వాదులను నీవు నివర్తింపరాదా ? నీవు హృషీకేశుడ వగుటచే ఇంద్రియములన్నియు నీ అధీనములో నుండునుకదా !- అనునది కవి హృదయము. "అయినను స్రష్టృత్వ - సంహర్తృత్వాదులచే ఉత్కృష్టులగు బ్రహ్మాదులచే భయము కల్గిన అది నాచే నివర్తింపబడుటకు సాధ్యమా ? ఏమి ?" అని భగవానుడు తలచినట్లు భావించిన దేశికులు అందులకు సమాధానమును మూడవపాదమును పల్కుచున్నారు.

(అతిలంఘితద్రుహిణశంభుశక్రాదికమ్) - "అతిలంఘితాః ద్రుహిణశంభు శక్రాదయః యేన" అని విగ్రహము. పరత్వాదులచే బ్రహ్మాదులను అతిక్రమించిన వాడని భావము. భగవానుడు ఎవరినైనను నిగ్రహింపగోరినచో "బ్రహ్మ స్వయంభూ శ్చతురాననో వా, రుద్ర స్త్రినేత్ర స్త్రిపురాంతకో వా, ఇంద్రో మహేంద్ర స్సురనాయకో వా త్రాతుం న శక్తా యుధి రామవధ్యమ్" అనునట్లు బ్రహ్మాదులకు అతనిని రక్షింప సాధ్యము కాదు. తాను రక్షింపగోరిన గోపాలురను శిలావర్షముచే పీడింపసాగిన ఇంద్రుడును పరాజితుడయ్యెను. వత్సాపహారమును చేసిన బ్రహ్మయు ఓడిపోయెను. అనిరుద్ధ రక్షణమునకు వచ్చిన శ్రీకృష్ణునితో రుద్రుడు యుద్ధము చేసి పరాజయమును పొందెను. "పిన్నుమ్ నేర్ శరిన్దాన్ ముక్కణ్ మూర్త్తి కణ్డీర్" అను శఠకోపసూక్తికి ఆజాయిరప్పడి వ్యాఖ్యానకారులగు పిళ్లాన్ -"యుద్ధత్తిఱ్కు కొడికట్టిక్కొణ్డువన్ద రుద్రనమ్

పరాజయవ్రీడైయాలే వస్త్రావగుంఠితముఖనాయ్క్కొణ్డు పోనాన్" అని వ్యాఖ్యానించిరి. ఇట్లు పరాత్పరుడైనచో మాఱు మాట్లాడక సంశయింపక చేరవచ్చునా? అనినచో అందులకు పిమ్మట సమాధానమును దేశికులు తెలుపుచున్నారు.

(రమాసఖమ్) - లక్ష్మీదేవికి సఖుడైన భగవానుని "న కశ్చిత్ నాపరాధ్యతి", "ప్రాప్తై రపి త్వయా నిత్యం సంరక్ష్య శ్శరణాగతః" అని పల్కునట్టి పురుషకారభూతయగు లక్ష్మీదేవి ఉన్నప్పుడు మనము సంశయింపక ఆశ్రయింపవచ్చునని తాత్పర్యము. "రమాసఖమ్" అనుటచే "సమయో రేవ శోభతే" అనునట్లు సమానుల సఖ్యమగుటచే పురుషకారమునకు మూలమగు భగవానుని వాల్లభ్యము మొదలగునవి కలవని తెలుపబడినది. పురుషకారము లేకుండుటవలన స్వామిని పొందలేక పోవుచున్నానా ? లేదే ! లక్ష్మీదేవి సన్నిహితమై యుండగానే విషయాదులకు వశుడనై ఎంతకాలము తపింతును ? అని తాత్పర్యము. అయినను పరమపదము, పాలకడలి మొదలగు స్థలములు పరోక్షములు కదా ! భగవానుని ఎచట ప్రార్థించగలము ? అనినచో

(రంగధుర్యమ్) - అందఱును ప్రత్యక్షముగా దర్శించి ప్రార్థించునట్లు శ్రీరంగమున సదా సన్నిహితుడైయున్నాడు. శ్రీరంగధూర్వహుడై, సదా సన్నిహితుడై యుండగా, నా భారమును వహింపక యుండుటయా ?

(తదేతత్ కి మపి మహః) - ఆ ఈ విలక్షణమైన తేజస్సు.

(తత్)- పరమపదమున "యదతః పరో దివో జ్యోతి ర్దీప్యతే" అనునట్లు దీప్యమానమైన ఆ తేజస్సే -

(ఏతత్) - శ్రీరంగమున ప్రత్యక్షముగా దర్శించునట్లు-

(మహః)- శ్రీరంగనాథుని రూపములోని తేజస్సును- అని భావము.

(అధీమహే) - అనుసంధింతుము.

"కి మపి" అను విశేషణబలమువలన ప్రసిద్ధములైన సూర్యాది జ్యోతిస్సుల కన్న వైలక్షణ్యము తెలుపబడినది. "పంపాతీరే హనుమతా సంగతో వానరేణ హ" అని విరహార్తుడై శ్రీరాముడు శోకించునపుడు విరహోద్దీపకమైన పంపాతీరములో హనుమ త్సంబంధము కల్గుటను "హ" అనుచు వాల్మీకి మహర్షి ప్రశంసించినట్లు, దేశికులును తాము విషయాదులకు వశులై బాధపడుదశలో ఈ ప్రకృతిలో శ్రీరంగమున శ్రీరంగనాథుని దర్శించి, అనుసంధించునట్లు సుకృతము కల్గియుండుటను గూర్చి తలచి,

"అధీమహే" అను బహువచనప్రయోగముతో తమను శ్లాఘించుచున్నారని చెప్పవచ్చును. "వమక్కోర్ విది వాయ్క్కిన్ఱదే" అని అధికారసంగ్రహమున తమను ప్రశంసించినట్లు, ఇచట తమను ప్రశంసించుకొనుటలో బహువచనమునకు తాత్పర్యము. అనేక ధాతువులుండగా, ఉచ్చారణ -అనుచ్చారణరూపమైన అధ్యయనార్థక ధాతువును ప్రయోగించుటచే "ఆశ్రితాభయప్రదుడై, అనాశ్రితభయప్రదుడై, స్వనిదేశాధీనభయాభయవిధాయి సమస్తవస్తుజాతుడై, పరత్వమున శంకితులైన బ్రహ్మరుద్రాదుల కంటెను (ఉత్కృష్టుడై) పరుడైయున్నవాడు, అప్రాకృతస్వయంప్రకాశ-దివ్యమంగళ విగ్రహమును కల్గినవాడై శ్రీరంగమున నిత్యవాసమును చేయు శ్రియఃపతియగు శ్రీరంగనాథుడే" అని ఆచార్యులగు అప్పుళ్లార్ ఆద్యోచ్చారణరూపమైన ఉపదేశమును చేయగా, నేను అనూచ్చారణమును చేసితినే కాని, నేను నా స్వబుద్ధిచే కల్పించి పల్కినవాడను కాదు" అను భావము సూచించిపబడినది. "ఆరణత్తేశికర్ శాత్తినర్ వమ్ పోదమరు న్దిరుమాదుడన్ నిన్ఱ పురాణనైయే"అని, "ఓరుయిరున్ఱ్మైయై నీ మఱవేల్" అని, శ్రియః పతియగు నారాయణే పరతత్త్వమని వేదాంతాచార్యులు ఉపదేశించిరని, "అప్పుళ్ళార్ కిళిప్పిళ్లైయై ప్పళక్కి వైక్కుమాప్పోలే యడియేనై పళక్కివైత్తార్" అనియు శ్రీమద్రహస్యత్రయసారమున దేశికులు స్వయముగా పల్కిరి.

అవ :- ఇట్లు పూర్వశ్లోకమున భగవానుని అనుసంధింతుము అని పల్కి, పిమ్మట ఆలోచించి, రాక్షసులు లంకలో పిశాచనృత్యముచేసినట్లు తమ మనసున విషయములు అట్లు భీకరనృత్యమును చేయుటను చూచిన దేశికులు "భగవానుడు ఉపకరణసహితుడై క్షణము అయినను విశ్లేషింపక, రక్షింపనిచో విషయములను మనస్సును వీడవు, స్వామిని చింతింప నీయవు" అని తలచి, తమ మనస్సున భగవానుని ఉద్దేశించి జాగరూకుడై యుండవలయునని ప్రార్థించుచున్నారు.

దయాశిశిరితాశయా మనసి మే సదా జాగ్రయుః
శ్రియాఽధ్యుషితవక్షసః శ్రితమరుద్వృధాసైకతాః ।
జగద్దురితఘస్మరా జలధిడింభడంబస్పృశః
సకృత్ప్రణతరక్షణప్రథితసంవిద స్సంవిదః ॥ 2 ॥

దయా = కరుణచే, శిశిరితాశయాః = చల్లనిదైన హృదయమును కల్గినవి, శ్రియా = లక్ష్మీదేవిచే, అధ్యుషిత = అధిష్ఠింపబడిన, వక్షసః = హృదయమును కల్గినవి, శ్రిత = ఆశ్రయించిన, మరుద్వృధా = కావేరీనదియొక్క, సైకతాః = ఇసుకతిన్నెలను కల్గినవి,

జగద్దురిత= లోకములోని పాపములకు, ఘస్మరాః = నాశకమైనవి, జలధిడింభ = సముద్రముయొక్క శిశువుయొక్క, డంభస్పృశః = ఆడంబరమును కల్గినవి (పోలికను కల్గినవి), సకృత్ = ఒకసారి, ప్రణత = ప్రపత్తిచేసినవారిని, రక్షణ = రక్షించుటలో, ప్రథిత = పేరుపొందిన, సంవిదః = ప్రతిజ్ఞను కల్గినవి అగు, సంవిదః = జ్ఞానములు (జ్ఞానస్వరూపియైన శ్రీరంగనాథుడు) మే = నాయొక్క, మనసి = మనస్సులో, సదా = ఎల్లప్పుడు, జాగృయుః = జాగరూకతతో వసించునుగాక !

దయచే చల్లని హృదయమును కల్గినవాడు, లక్ష్మీదేవికి నివాసస్థానమైన వక్షః స్థలమును కల్గినవాడు, కావేరీనదీసైకతప్రదేశమున (ఇసుక తిన్నెపై) వేంచేసియున్నవాడు, లోకములోని పాపములను నశింపచేయువాడు, సముద్రవర్ణుడు, సముద్రతీరమున సుగ్రీవమహారాజు మొదలగువారు ఉన్నకాలమున "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ" అని ఒకసారి ప్రపత్తిని చేసినవానిని ఎచటనైనను రక్షింతును- అని ప్రతిజ్ఞను చేసినవాడును, జ్ఞానస్వరూపుడును అగు శ్రీరంగనాథుడు అకించనుడనగు దాసుని మనస్సున ఎల్లప్పుడు జాగరూకుడై వేంచేసియుండవలయును- అని తాత్పర్యము.

(దయాశిశిరితాశయాః) దయచే చల్లనిదైన హృదయమును కల్గినవి. మీరు చేసిన పాపములవలన భగవానుని హృదయము తపింపబడినది కాగా, మీ హృదయమున అతడు నిత్యవాసమును చేయునా ? అనినచో, నేను చేసిన పాపము "యత్ బ్రహ్మకల్పనియుతామభవేఽప్యనాశ్యమ్" అనునట్లు కాలతత్త్వము ఉన్నంతకాలము అనుభవించినను తీరనిది!. "జలధే రివ శీతతా దయేయం వృషశైలాధిపతే స్స్వభావ భూతా" అని తెలుపబడిన దయచే శీతలమైన హృదయమును కలవాడై, నామనస్సున, హృదయమున ప్రవేశించిన చోరుని తరుముటకు, తిరిగి అతడు రాకుండునట్లు కాపాడుటకు, "పాపై రనాదిభవసంభవవాసనోత్థైః, దుఃఖేషు యః ఖలు మిమజ్జతి హంత జంతుః, తం కేవలం కృపయైవ సముద్ధరిష్యన్" అనునట్లు తన దయనే సాధనముగా గొని నిత్యవాసమును చేయవలయును-అని ఇచటి తాత్పర్యము. "ఇత్తనై యడియరావార్ క్కిరఙ్గుమ్ నమ్మరఙ్గనాయ పిత్తనే" అని భక్తాంఘ్రిరేణుసూరియు పల్కిరికదా !

(శ్రియాఽధ్యుషితవక్షసః) క్షణకాలము స్వామిని వీడియున్నచో దండధరత్వము ఉద్బుద్ధమగునో! ఏమో! అను అతిశంకను కల్గినదై నిత్యవాసమును చేయునని తాత్పర్యము. "మద్పదద్వంద్వ మేకం యే ప్రపద్యంతే పరాయణమ్, ఉద్ధరిష్యామ్యహం దేవి సంసారాత్ స్వయ మేవ తాన్" అను విషయమును భగవానునివలన విని, "ప్రాజ్ఞై

రపి త్వయా నిత్యం పంరక్ష్య శ్శరణాగత:" అని పల్కునట్లు లక్ష్మీదేవి పురుషకారముచే ఉపశమించిన ప్రతాపమును కలవాడై, నా పాపములను భరించి, హృదయమున వేంచేసియుండదగును- అని భావము. అపుడు, "పేరి మాఱాద పూమేలిరుప్పాళ్ వినై తీర్క్కుమే" అనునట్లు భగవానుడు లక్ష్మీదేవితో కలసి నాకు విషయములవలన కల్గిన బాధను, దానికి మూలమైన పాపములను నివర్తింపచేసి, నామనస్సున జాగరూకుడై వేంచేసియుండవలెనని తాత్పర్యము. భగవానునకు దయ లేక పోవుటచే నేను ఫలమును పొందలేక పోవుచున్నానా? లేక, పురుషకారము లేకపోవుటచే ఫలమును పొందలేక పోవుచున్నానా? ఇది అంతయు పరిపూర్ణముగా నుండగా, భగవానుడు దూరమై, విషయములచే బాధింపబడతగునా ? అని కవి శోకించుచున్నారని భావము. అయినను, "పంవిద:" అని జ్ఞానానందస్వరూపుడై సర్వేశ్వరుడైయున్న స్వామి క్షుద్రుడనగు నా హృదయమున వసించునా ? అను శంక కలుగగా, అందులకు సమాధానము దేశికులు పిమ్మట తెలుపుచున్నారు.

(శ్రితమరుద్వృథాసైకత:)- "వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతి:, ఆస్తే విష్ణు రచింత్యాత్మా" అని శ్రీవైకుంఠమున "వానిలవరశు" (పరమపదనాథుడు)గా నిత్యవాసమును చేయువాడేకదా సౌశీల్యగుణావిష్కారమునకై ఒక నదియొక్క ఇసుకతిన్నెపై వేంచేసియున్నాడు. ఇట్లు చేతికి అందిన వస్తువే నోటికి అందలేదుకదా! అనియు కవి వాపోవుచున్నారు. ఇట్టి సౌశీల్యముచే అతిక్షుద్రుడనైనను నా మనస్సుననుండ తగుననియు భావము. అట్లయినను, మీరు చేసిన పాపము నశించినకదా మీ హృదయమున స్వామి నివసించుట వీలగును ? అనినచో అందులకు ప్రతివచనమును పిమ్మట పల్కుచున్నారు.

(జగద్దురితఘస్మరా:) - లోకములోని పాపములకు భక్షకములగునవి అని అర్థము. "భక్షో ఘస్మరో" అని అమరము, "చుళకితసముద్రో మునివర:" అనునట్లు అగస్త్యమహాముని సముద్రమును అరచేతిలో గ్రహించి, "అచ్యుతాయ నమ:" అని భక్షించినట్లే, అపరిమితమైన పాపసముద్రమును ఒక ఆచమనమునకును సరిపోవునట్లు భక్షించువానికి నా పాపములు మాత్రము అందు అణగి పోకుండునా ? "మదేకవర్జమ్" అను ప్రతిజ్ఞయుండునా ?- అని తాత్పర్యము.

(జలధిడింభడంబస్పృశ:) - సముద్రశిశువుయొక్క ఆడంబరమును, పోలికను కల్గిన- అని అర్థము "కడల్‌వణ్ణన్" అని, "వేలైవణ్ణన్" అని కీర్తింపబడినట్లు సముద్రమువంటి సౌందర్యమునుకల భగవానుడు, అందమును అసదృశమై యుంటినని

సముద్రమునకుకల దంభమును పోగొట్టెనని తాత్పర్యము. ఇచట "అర్ణవతర్ణకః" అను పరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవ ప్రయోగమును స్మరింపనగును. మహాసముద్రమువలె సంపూర్ణముగా అనుభవింపలేకుండుటగాక, సముద్రశిశువువలె పూర్ణముగా అనుభవించు నట్లు శ్రీరంగమున వేంచేసియున్నవానిని దర్శింపలేకుండునట్లు విషయములు నన్ను బాధించుటయే కాక, ఆ శ్రీరంగక్షేత్రముకూడ యవనులచే ఆక్రమింపబడినదే ! ఏమి చేయుదును ? అని కవి పరితపించుచున్నారు.

(సకృత్ ప్రణతరక్షణప్రథితసంవిదః) -"సకృత్ప్రణతరక్షణే ప్రథితప్రతిజ్ఞా" అని భావము. "సంవిదాగూః ప్రతిజ్ఞాయామ్" అని నిఘంటువచనము. "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ" అనుచు సముద్రతీరమున ప్రసిద్ధముగా, అందఱు వినునట్లు ప్రతిజ్ఞను చేసినవాడవు నాకు అభయప్రదానమును చేయరాదా? నీవు చేసిన ప్రతిజ్ఞను మఱచితివా? "అఱవే భరమెన్నదైక్కలమ్"అనునట్లు ఆచార్యులు నన్ను నీకు భార మని సమర్పించిరికదా ! అని కవి పల్కుచున్నారని తాత్పర్యము.

(సంవిదః)- "సత్యం జ్ఞానమ్" అనునట్లు జ్ఞానానందరూపుడగు శ్రీరంగనాథుడని అర్థము. ఇచటి బహువచనము పూజార్థకమని చెప్పనగును. పూర్వశ్లోకమున "మహః" అని ఏకవచనముతో నిర్దేశించి, "అధీమహే"అని తమను బహువచనముతో తెలిపిరి. ఈ శ్లోకమున తమ ఆకించన్యము వెల్లడియగునట్లు "మే" అనుచు తమను ఏకవచనముతో నిర్దేశించుకొని, భగవానుని గొప్పతనము తెలియునట్లు "సంవిదః" అని బహువచనముతో పల్కిరి. "మహః" అని పూర్వశ్లోకమున, స్వరూపమున తేజస్త్వము లేకుండుటచే, తేజస్త్వముతో దివ్యమంగళవిగ్రహములను లక్షించిరి. జ్ఞానత్వము స్వరూపమునకుండుటచే ఈ శ్లోకమున "సంవిదః" అనుచు స్వరూపమును తెలిపిరి. జ్ఞానానందాత్మకశుద్ధసత్త్వమయ దివ్యమంగళవిగ్రహమునకు జ్ఞానానందాత్మకత్వము ప్రసిద్ధమగుటచే విగ్రహవిశిష్టుడైన భగవానుని సూచించినట్లయినది. "సంవిదః" అనుచు తనయొక్క ధర్మభూతజ్ఞానములను తెలిపిరనియు చెప్పవచ్చును. అపుడు దయాశిశిరతాశయత్వాది విషయకములైన జ్ఞానములు నా మనస్సున జాగరూకములై యుండవలయునని ప్రార్థించిరని భావము. "హరినీలశిలావిభంగనీలాః ప్రతిభా స్సంతు మమాంతిమప్రయాణే" అను మొదలగు దేశికసూక్తులు ఇచట స్మార్యములు.

(సదా మనసి జాగ్రయుః) - క్షణము విశ్లేషించినను చోరులవలె విషయములు

రంధ్రాన్వేషులై నామనస్సును ఆక్రమించును. కావున నీవు సదా జాగరూకుడవై యుండవలయునని భగవానునితో కవి పల్కుచున్నారు.

సరోయోగి ముదల్ తిరువన్దాది మొదటి పాశురమున భగవానుని తేజో రూపముగను, భూతయోగి ఇరణ్డామ్ తిరువన్దాది మొదటిపాశురమున జ్ఞానరూపముగను కీర్తించినట్లే, ఇచట దేశికులు మొదటి శ్లోకమున "మహః" అనుచు తేజస్సుగను, ఈ శ్లోకమున "సంవిదః" అనుచు జ్ఞానముగను పొగడుట గమనార్హము.

అవ :- నేను నీ మనస్సున జాగరూకుడనై యుండునట్లు నాకు తగిన ఒక అర్చననైనను నీవు చేసినకదా నేను అట్లు చేయుట? - అని భగవానుడు తలచినట్లు భావించిన దేశికులు "అత్యల్పబుద్ధిని కలవాడనై, మహామోహాక్రాంతుడనై, గుణత్రయ వశ్యుడనై, బాలురవలె హితములను -అహితములను వేనిని తెలియని వాడనైయున్న దాసుడనగు నేను సర్వేశ్వరుడవగు నీకు తగిన అర్చనను చేయక పోయినను, ఏదైనను ఒకటి చేసినను దానినే గొప్ప అర్చనగా స్వీకరింపవలయునని" ప్రార్థించుచున్నారు.

యదద్య మితబుద్ధినా బహుళమోహభాజా మయా
గుణగ్రథితకాయవాఙ్మనసవృత్తివైచిత్ర్యతః ।
అతర్కితహితాహితక్రమవిశేష మారభ్యతే
తదప్యుచిత మర్చనం పరిగృహాణ రంగేశ్వర ॥ 3 ॥

రంగేశ్వర = శ్రీరంగనాథా, అద్య = ఇపుడు, మితబుద్ధినా = అల్పబుద్ధిని కలవాడను, బహుళ = అధికమైన, మోహభాజా = మోహమును పొందినవాడను అగు, మయా = నాచే, గుణ = (మూడు గుణములనెడి) త్రాటిచే, గ్రథిత = కూర్పబడిన, (కట్టబడిన), కాయ వాక్ మనస = శరీరము, వాక్కు, మనస్సు అను వీనియొక్క, వృత్తి = వ్యాపారముల, వైచిత్ర్యతః = వైచిత్రివలన, అతర్కిత = ఊహింపని, హితాహితక్రమ = హితము, అహితముల క్రమవివక్షను కల్గియుండునట్లు, యత్ = ఏ వ్యాపారము, ఆరభ్యతే = ప్రారంభింపబడుచున్నదో, తత్ +అపి = దానినికూడ, ఉచితం = (నీకు) తగినది అగు, అర్చనం = అర్చనగా, పరిగృహాణ = పరిగ్రహింపుము.

తురుష్కులు మొదలగువారు శ్రీరంగమును చుట్టుముట్టియున్న ఈ సమయమున విషయములు మనస్సును ఆక్రమించియున్న మితబుద్ధిని, మహా మోహమును కల్గినవాడను, సత్త్వరజస్తమోగుణములతో కట్టబడిన త్రికరణములను కల్గిన వాడను అగు నేను "ఇది హితము. ఇది అహితము" అని కొంచెముకూడ తెలియలేక,

ఏవ్యాపారమును (పనిని) చేయుచున్నానో, దానిని సర్వలోకనాథుడవు, శ్రియఃపతివి, పరమాత్మవు అగు నీకు తగిన ఆరాధనగా తలచి అంగీకరింపుము.

(రంగేశ్వర) నీవు శ్రీరంగాది సర్వప్రపంచమునకును ఈశ్వరుడవైయుండగా, కంసవేనాదులవలె తురుష్కయవనాదులు తమనే ఈశ్వరులుగా భావించి, జగత్తునందు అంతట వ్యాపించియున్నారు. అట్లే, నీ సొత్తు అయిన నా ఆత్మను విషయములు ఆక్రమించియున్నవి. వీనినన్నిటిని నివృత్తిజేయరాదా ! నీ సొత్తును నీవే రక్షింపవలదా? అని కవి పల్కుచున్నారని భావము.

(అద్య) - ఇపుడు నేను విషయాక్రాంతుడనై, జగత్తు తురుష్కయవనాక్రాంతమైయున్న సమయమున -అని అర్థము. దేశకాలవైగుణ్యము లేకున్నను, విషయములచే ఆక్రమింపబడినవాడను కాకున్నను నీకు తగిన అర్చనను చేయ సాధ్యము కాదు. దేశకాలవైగుణ్యము ఏర్పడి, నేను విషయములకు వశుడనైయున్నపుడు నీకు ఇక ఉచితమైన అర్చనము చేయవీలగునా? అని కవి హృదయము.

(హితబుద్ధినా) - అల్పబుద్ధిని కల నాచే- అని భావము. ఇచట బుద్ధి అనునది భగవద్విషయక బుద్ధిని తెలుపును. అంతియేకాని, అచిద్వ్యావర్తకజ్ఞానమును తెలుపునని చెప్పరాదు. భగవద్రసవిషయకమైన, అపరిమితమైన బుద్ధిని కల్గియున్నచో నీకు తగిన అర్చననుగూర్చి పర్యాలోచనను చేసి, అర్చనను చేయవచ్చును. నీ అనుభవరసము ఈషణ్మాత్రమైనను తెలియకయున్నచో సంసారులవలె విషయాస్వాదమునందు ఆసక్తుడనై, సంతుష్టుడనై యుండవచ్చును. ఇట్లు అల్పబుద్ధినికల్గి యుండుటచే నీకు తగిన అర్చనను చేయుటకు తెలియలేదు. సంసారులవలె ఊరకనే యుండుటకును వీలు కాలేదు- అని తాత్పర్యము.

(బహుళమోహభాజా) -మోహశబ్దము కామక్రోధాదులకును ఉపలక్షణము.

(గుణగ్రథితకాయవాఙ్మనసవృత్తివైచిత్ర్యతః) - రజోగుణము, తమోగుణము, తన్మిశ్రసత్త్వగుణము- అను గుణత్రయములచే బంధింపబడిన కరణత్రయముల వ్యాపారవైచిత్రిచే -అని భావము. కరణత్రయములు, గుణత్రయములను మూడు దారములచే బంధింపబడి, సన్మార్గమున చరింపక "ఎన్నైయాళుమ్వన్కో"అనునట్లు నాకు శేషమైయున్న ఇంద్రియములు నన్ను తమకు శేషముగా చేసికొని, పరిపాలించుచు, విచిత్రమైన వ్యాపారములను చేయునపుడు నేను నీకు ఉచితమైన ఆరాధనను చేయుట ఎట్లు వీలగును?

(అతర్కితహితాహితక్రమవిశేషమ్) - ఊహింపబడకుండనున్న హితాహితక్రమ విశేషములను కల్గియుండునట్లు -అని అర్థము. ఇది క్రియావిశేషణము. ఏ వ్యాపారమును చేసినచో నీకు ఉచితమైన అర్చనయై, దాసునకు హితమైయుండునో, ఏ వ్యాపారమును చేసిన నీకు ఆరాధనకాకుండుటయై, దాసునకు అహితమైయుండునో ఆ వ్యాపార క్రమమును తెలియనివాడనై, కరణత్రయములతో ఎట్లు వీలయిన అట్లు చేయుచున్నానని భావము. ఇచట, మహామోహము ఆవహింపగానే, "లంకారుద్ధవిదేహ రాజతనయాన్యాయ" మున సుమతి అను స్త్రీ మోహమనువానిచే ఆక్రమింపబడి కార్శ్యమును పొందెనని, అపుడు వివేకమను ప్రభువునకు బలహాని కల్గి పురుషుడు వివేకకార్యమగు ఊహాపోహజ్ఞానము లేక, హితాహితక్రమమును తెలియక, "కిం కరిష్యామహే వత్స క్వ వా గచ్ఛావ లక్ష్మణ" అని శ్రీరామునివలె అలమటించెననియు ఒక అర్థము ధ్వనించును.

(యత్ ఆరభ్యతే) - ఏ వ్యాపారము ఆరంభింపబడుచున్నదో -

(తదప్యుచిత మర్చనం పరిగృహాణ) - అదియు నీకు తగిన అర్చనగా గ్రహింపవలయును. దాసుడు చేయు కొన్ని పనులనె గొప్ప అర్చనగా తలచి, రక్షింప నగునని తాత్పర్యము. భట్టర్ బాల్యదశలో పాంసుక్రీడయందు "అరుళప్పాడు జీయర్" అని పలుకగానే అపుడు అచటనేయున్న శ్రీరామానుజులు "నాయన్దేన్" అనుచు సమీపింపగా, భగవత్ప్రసాదము అనుచు మన్నును భట్టర్ వారికి ఇవ్వగా, రామానుజులును చేతిలో గైకొనిరి- అను ఐతిహ్యమును ఇచట స్మరింపనగును.

అవ :- దేశికేంద్రా ! మీరు ప్రసిద్ధులైన అగ్నీంద్రాది దేవతలను ఆశ్రయించి, మీ అభీష్టమును పొందవచ్చునుకదా! అని భగవానుడనగా -"ఆ ఇంద్రాదిదేవతలును నీ ఆజ్ఞను ఉల్లంఘించిన ఏమి ఉపద్రవము వాటిల్లునో ? అని భయపడుచు నీకు పరతంత్రులై కైంకర్యమును చేయుచున్నారు. ఇట్లు భయపడి, నీ ఆజ్ఞను పాలించుచున్నారనుటను పౌరుషేయములైన స్మృతిపురాణములే కాక, నిత్యనిర్దోషమై, కావుననే యథార్థవాదియైన వేదమును "మహత్ భయం వజ్ర ముద్యతమ్", "భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః , భీషాస్మా దగ్ని శ్చేంద్ర శ్చ, మృత్యు ర్ధావతి పంచమ ఇతి", "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" ఇత్యాదిగా తెలుపుచున్నది. కర్మసంబంధమైన పారతంత్ర్యము మొదలగు దోషములను లేనివాడవు, స్వతంత్రుడవగు నీతో సాక్షాత్ సంబంధమును కాని, పరంపరాసంబంధమును కాని పొంది, నీకు సంబంధించినవాడనను పేరును కల్గి, స్తోత్రమును చేసినవాడు ఇట్టి భయమును దాటును. కావున స్వతంత్రుడవగు

నీయొక్క సంబంధమును పొంది, స్తుతి చేసి, నా అభీష్టమును సాధించుకొనకుండ, పరతంత్రులగు ఇతరదేవతలను ఆశ్రయించి, ఫలమును పొందదగునా?" అనుచు దేశికులు ఈక్రింది శ్లోకమును అనుగ్రహించిరి.

మరుత్తరణిపావకత్రిదశనాథకాలాదయః
స్వకృత్య మధికుర్వతే త్వదపరాధతో భిభ్యతః ।
మహ త్కిమపి వజ్ర ముద్యత మివేతి యచ్ఛ్రూయతే
తరత్యనఘ తద్భయం య ఇహ తావకస్తావకః ॥ 4 ॥

అనఘ = దోషరహితుడైన, రంగనాథా, మరుత్ = వాయుదేవుడు, తరణి = సూర్యుడు, పావక = అగ్ని, త్రిదశనాథ = ఇంద్రుడు, కాల = యముడు, ఆదయః = మొదలగువారు, తత్+అపరాధతః = నీపట్ల, అపరాధమువలన, బిభ్యతః = భయపడువారై, స్వకృత్యం = తమ తమ కర్తవ్యమును, అధికుర్వతే = చేయుచున్నారు. యత్ = ఏ భయము, ఉద్యతం = ఎగసిన, మహత్ = గొప్పదైన, వజ్రం = వజ్రాయుధమువలె, కి మపి = విలక్షణమైనది, ఇతి = అని, శ్రూయతే = వేదమున తెలుపబడినదో, తత్ భయం = ఆభయమును, ఇహ = ఈ లోకమున, తావకస్తావకః = నిన్ను స్తోత్రమును చేయువాడు, యః= ఎవడో (అతడు), తరతి = దాటుచున్నాడు.

ఎట్టి దోషమును లేని స్వామీ ! వాయువు మొదలగు దేవతలు నీ ఆజ్ఞను తప్పిన ఏమి కష్టము కల్గునో అని భయపడి తమతమ కైంకర్యములను చేయుదురు. నీ ఆజ్ఞను దాటిన గొప్ప వజ్రాయుధమును ఎత్తి ప్రయోగించిన ఎట్టి భయము కల్గునో, అట్టి భయము కల్గును అని వేదమున తెలుపబడినది. నిన్ను స్తోత్రము చేయువానికి అట్టి భయము ఏమియు ఎప్పుడును కలుగదు.

(మరుత్తరణిపావకత్రిదశనాథకాలాదయః) - వాయువు, అగ్ని మొదలగువారు.

(త్వదపరాధతః బిభ్యతః స్వకృత్యమ్ అధికుర్వతే) - "విష్ణుమాయా-మహాపద్మ గర్తాంధతమసావృతాః" అనునట్లు వారు పారార్థ్యపారవశ్యాదులను కల్గినవారగుటచే రక్షకులు కారు. ఇట్లు దేవతలు భయపడునట్లు శ్రుతిప్రసిద్ధమైన భయమును నీ స్తోతలు దాటగలరు. శ్లోకమున మహదిత్యాది ప్రయోగము శ్రుత్యనువాదము. పంచమ్యర్థమున ప్రథమావిభక్తి ప్రయోగింపబడినది.

(మహ త్కిమపి .... ) గొప్ప వజ్రాయుధమును చేతిలో దాల్చి, ప్రయోగించిన ఎట్టి భయము కల్గునో అట్టి భయము భగవానుని ఆజ్ఞాతిలంఘనమువలన కల్గునని తాత్పర్యము.

**(అవఘు)** - అకర్మవశ్యుడవై, స్వతంత్రుడవగుటచే తలచినపుడు రక్షింప శక్తిని కలవాడవని తాత్పర్యము.

**(తత్ భయం తావకస్తావక: తరతి)** - ఆ భయమును నీ ఆశ్రితుడను పేరును పొంది, నిన్ను స్తుతించువాడు దాటును. కావున నీవే నాకు రక్షకుడవు కావలయును - అని తాత్పర్యము.

అవ :- పరతంత్రులగు దేవతలవలన అభయప్రాప్తి కలుగదని, స్వతంత్రుడవగు నిన్ను స్తుతించినవానికి అభయము కలుగుననియు పూర్వశ్లోకమున తెలుపబడిన అర్థమును ఈ శ్లోకమున విశదీకరించుచు, "నిన్ను ఆశ్రయించినవారికి దేవతాంతరముల వలనను భయము ఏర్పడ''దని కవి పల్కుచున్నారు. స్వాధీనములైన త్రివిధచేతనాచేతన స్వరూపస్థితిప్రవృత్తి బేధములను కలవాడవై, అనవధికాతిశయా సంఖ్యేయకల్యాణ గుణగణమహోదధియై, సర్వసులభుడై, శ్రీరంగమున అభిముఖుడవై, నిత్యవాసమును చేయు నీకు ప్రదక్షిణనమస్కారాది సులభోపాయములద్వారా ఎవడు ఆశ్రయించునో అతడు సర్వదేశ -సర్వకాల -సర్వావస్థలయందు ఎవరివలనను భయమును పొందడు. కావున, పరతంత్రులై, పరోక్షముననున్నవారై, దుర్లభులైయున్న మిగిలిన దేవతలను ఆశ్రయించిన ఫలమును పొందుట ఎట్లు సాధ్యము ? వారివలన ఫలము కల్గినను కొంచెము గానే కల్గును తప్ప, సర్వభయనివృత్తి కలుగదు. ఇట్లు సర్వభూతములకు ప్రియమును కల్గించువాడవై, అతిసులభోపాయవశ్యుడవగు నిన్ను సేవింపక, విషయము లనెడి, మ్లేచ్ఛులచే ఆక్రమింపబడినవాడనై "కారొళివణ్ణనే ! కణ్ణనే! కదఱుకిన్టేన్" అనునట్లు ఆక్రోశించు నాకు బాధకములగు విషయములు, మ్లేచ్ఛులు మొదలగువానిని నివర్తింపచేసి రక్షింపవలదా ? "అరుళార్ కళైకణమ్మా వరజ్గమావకరుళానే" అనునట్లు వేఱు రక్షకులు కలరా ? అను అభిప్రాయముతో ఈ శ్లోకమును కవి పల్కుచున్నారు.

భవంత మిహ య స్స్వధీనియతచేతనాచేతనం
పనాయతి నమస్యతి స్మరతి వక్తి పర్యేతి వా ।
గుణం క మపి వేత్తి వా తవ గుణేశ గోపాయితు:
కదాచన కుతశ్చన క్వచన తస్య న స్యాత్ భయమ్ ॥ 5 ॥

గుణేశ = సద్గుణములకు ప్రభువైనవాడా !, య: = ఎవడు, స్వధీనియత =తన సంకల్పమునకు అధీనమైన, చేతన+అచేతనమ్ = చేతనాచేతనములను కల్గిన, భవంతం= నిన్ను, పనాయతి = స్తోత్రమును చేయుచున్నాడో, నమస్యతి = నమస్కారమును

చేయుచున్నాడో, స్మరతి = స్మరించుచున్నాడో, వక్తి= (నామములను) పల్కుచున్నాడో, పర్యేతి వా = లేక ప్రపత్తిని చేయుచున్నాడో, ఒక గుణమునైనను, వేత్తి వా = తెలిసికొను చున్నాడో, తస్య = అతనికి, కదాచన = ఎప్పటికిని, కుతశ్చన = ఏకారణముచే నయినను, క్వచన = ఎక్కడను, భయం = భయము, న స్యాత్ = ఉండదు.

ఎవడు నీ స్తుతిని చేయుచున్నాడో, నిన్ను నమస్కరించుచున్నాడో, ధ్యానించు చున్నాడో, నామసంకీర్తనమును చేయుచున్నాడో, ప్రపత్తిని చేయుచున్నాడో, నీ గుణము లలో దేనినైను తెలిసికొనుచున్నాడో, అతనికి ఏకాలమునందు, ఎచటనైనను, ఎవరివలనను ఏవిధమైన భయమును కలుగదు.

(గుణేశ)- వాత్సల్యసౌశీల్యాది గుణములకు ప్రభువగు స్వామీ ! అనగా, గుణపరిపూర్ణుడా !,- అని భావము, "అవిజ్ఞాతా" అనునట్లు ఆశ్రితదోషానభిజ్ఞుడవై, ఆశ్రితులు తప్పులు చేసినను -"ఎన్నడియార్ అదు శెయ్యార్" అనునట్లు ఆశ్రితవాత్సల్యాది గుణములు నీయందు పరిపూర్ణముగా నున్నవని తాత్పర్యము. ఇట్లు సద్గుణములకు నిధివగు నిన్ను విడచి, నిలచిన తప్పు, కూర్చున్న తప్పు- అనునట్లు రంధ్రాన్వేషణతత్పరులై దోషములను పల్కి, శపించు మిగిలిన దేవతలను ఆశ్రయించిన ఏమి ఫలమును పొందనగును ? అనియును తాత్పర్యము. లేక, సత్త్వాదిగుణత్రయనివర్తకుడా ! నీవలె దేవతలు గుణత్రయనిర్వాహకులు కాక, గుణత్రయవశ్యులై యుండుటచే రక్షకులు కారనియు భావము.

(యః)- ఏ చేతనుడు -అని అర్థము. ఇందుచే జాతి-గుణ -వృత్తాదులచే ఉత్కృష్టులైయుండవలసిన అవసరము లేదు. వశిష్ఠ- చండాల తారతమ్యము లేక ఎట్టివాడైనను సరే - అని తాత్పర్యము. విశిష్టములగు వర్ణాశ్రమధర్మములు మొదలగునవి అన్నియు కొందమంది విశిష్టాధికారులకుమాత్రమే సంబంధించినవి. ఈ స్తుతి నమస్కారాదులు మాత్రము సత్యవచనమువలె సామాన్యధర్మములగుటచే చతుర్ముఖుని మొదలు శ్వపచునివరకు అందఱికిని శాస్త్రీయములై, సుకరములై యుండునను అభిప్రాయమున "యః"అను సర్వనామము ప్రయోగింప బడినదనవచ్చును.

(స్వధీనియతచేతనాచేతనమ్) - స్వసంకల్పాధీనచేతనా చేతనస్వరూపమును కల్గిన- అని అర్థము. ఇచట స్వరూపశబ్దము స్థితిప్రవృత్త్యాదులకును ఉపలక్షణము. కావున స్వసంకల్పాధీనములైన చేతనాచేతనస్వరూపస్థితిప్రవృత్తులను కలవాడవని తాత్పర్యము. ఇందుచే నిన్ను ఆశ్రయించినవానికి ఇక ఎవరివలన భయము కలుగదని తెలిపినట్లయినది.

పారతంత్ర్యమున క్రిమికీటాదులకు, అచేతనులకు, బ్రహ్మరుద్రేంద్రాది దేవతలకును మధ్య తారతమ్యము లేదని సారము.

**(భవంతమ్)** - "**శాధి మాం త్వాం ప్రపన్నమ్**" అని పల్కిన అర్జునునకు రథమున అభిముఖుడై నిలచిన విధమున,ఆశ్రితసమాశ్రయణీయుడవై, శ్రీరంగమున అభిముఖుడవై యున్న నిన్ను- అని భావము. ఇట్లు అభిముఖుడవైయున్న నిన్ను కాదని, ఆభిముఖ్యలేశము కూడ లేని అన్యదేవతలను ఆశ్రయించి ఆరాధించిన ఏమి ప్రయోజనము కల్గునని సారము.

**(పనాయతి)** - స్తుతించునో - అని అర్థము. "**లోకాధ్యక్షం స్తువన్ నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్**" అనునట్లు నిన్ను స్తుతించినవాడు సర్వదుఃఖ నిర్ముక్తుడగును అట్టి నిన్ను - "**యాను మెచ్చిరానై యేత్తినేన్ యానునుయ్‌వానే**" అనునట్లు నేను నిన్ను స్తుతించి, సర్వదుఃఖవినిర్ముక్తిని పొందక, విషయపరవశుడనై యుండతగునా?- అని తాత్పర్యము. ఇట్లు నమస్కార-స్మరణ- గుణవచన- ప్రదక్షిణ- గుణానుసంధానాదులను చేయువాడు సర్వభయనివృత్తిని పొందును. నేను వానిని చేయలేకపోయితిని అను హార్దాభిప్రాయమును "**నమస్యతి**" అను మొదలగు ప్రయోగముల ద్వారా కవి తెలుపుచున్నారు. "**య న్నమస్యే భగవతో యోగిధ్యేయాంఘ్రి పంకజమ్**" అని, "**ఇహస్థో వనదుర్గస్థం నమస్యామి కృతాంజలిః**" అనిపల్కిన అక్రూరునివలె, భరతునివలె దూరమునుండి అయినను నమస్కారమును చేయగల్గితినా ? "**స్మృతే సకలకల్యాణ భాజనం యత్ర జాయతే**" అని సర్వమంగళావహమగు నీ స్మరణమును చేయగల్గితివా? "**శూళ్‌పువల్ కుడన్దై యూనైప్పావియేన్ పావియాదు పావియేనాయినేనే**" అని తిరుక్కుడన్దైయందుగల ఆరావముదాళ్వాన్ స్వామిని స్మరింపక పాపిని అయితిని- అని తిరుమఙ్గైయాళ్వార్లు పల్కిన విధముగా నేనును నిన్ను స్మరింపక, పాపిని అయితిని. "**అవశేనాపి య న్నామ్ని కీర్తితే సర్వపాతకైః, పుమాన్ విముచ్యతే జంతుః సింహత్రస్తైః మృగై రివ**" అని, "**వాత్తన్నాల్ ననిల వురైప్పార్‌క్కిల్లై నల్‌కురవే**" అనియు పల్కువిధమున అర్థజ్ఞానము లేకున్నను, అవశముగానైనను నామసంకీర్తనమును చేసిన సర్వపాపవినిర్ముక్తి కలుగుట సాధ్యమైయుండగా, దానిని నేను చేసితినా ? "**ప్రదక్షిణం ప్రకుర్వాణ శ్చిత్రకూటం మహాగిరిమ్**" అని చిత్రకూటపర్వతమును భరతుడు ప్రదక్షిణము చేసినట్లు నీ కోవెలను ప్రదక్షిణము చేసితినా? "**బహవో నృప కల్యాణగుణాః పుత్రస్య సంతి తే**" అని నీకు అనేకకల్యాణ గుణములుండగా, వానిలో దేనినైనను తెలిసినవాడు సర్వభయనివృత్తిని

పొందుటకు సాధ్యమైయుండగా, నేనును ఆ విధముగా ఒక గుణమునైనను తెలియ గల్గితినా? - అని పరితపించుచున్నారు- అని ఇచటి హార్దాభిప్రాయము. ఇట్లు సర్వేశ్వరునకు చేయు ప్రదక్షిణము మొదలగునవి సర్వభయనివర్తకములనుటకు కారణము అతడు రక్షణోన్ముఖుడైయుండుటయే- అనుటను "గోపాయితుః" అను ప్రయోగముద్వారా కవి తెలిపిరి.

(గోపాయితుః) - "యః భవంతం పనాయతి, నమస్యతి, స్మరతి, వక్తి, పర్యేతి వా గోపాయితుః తవ కి మపి గుణం వేత్తి వా, తస్య కదాచన కుతశ్చన క్వచన భయం న స్యాత్" అని అన్వయము. ఏకాలమునందైనను ఎవరివలనను భయము కలుగదు- అని భావము. "స్వధీనియతచేతనాచేతనమ్" అనునట్లు చేతనాచేతనాత్మక సర్వ ప్రపంచమును అతని అధీనములో నుండుటచే బ్రహ్మాదిస్తంబపర్యంతమైన సృష్టిలో ఎవడైన ఒక చేతనునివలన మేరువుమొదలు సర్షప (ఆవగింజ) అవయవము పర్యంతము అయిన ఏదైన ఒక అచేతనవిశేషముచే అయినను ఆశ్రితునకు భయము కల్గినచో బ్రహ్మమేరువులకు- కృమికీటసర్షపావయవములకుమధ్య తారతమ్యము లేకుండునట్లు, రావణుడు పడిన పాట్లు పడునట్లు చేయువాడు. "కూర్ వేల్ కొళున్దొళిలన్ నన్దగోపన్" అని నందగోపుడు భగవానుని పట్లగల ప్రేమపారవశ్యముచే కృష్ణునకు తొట్టిక్రింద వేలాయుధమును చేతిలో దాల్చి ఈగలతోకూడ పోరాడి, రక్షించినచో, జీవుని విషయమున భగవానునకు ఎంతటి అభినివేశము ఉండవలయును? కావున, ఎవరివలన అయినను ఆశ్రితునకు భయము లేదని తాత్పర్యము. "పర్యేతి వా వక్తి వా" అని "వా" అను అవ్యయమును ప్రయోగించుటవలన సముచ్చయము తెలుపబడలేదు. వానిలో ఏఒక్కటి అయినను చాలునని సూచింపబడినది. సర్వసులభుడవై, సర్వఫలప్రదుడవై, సర్వభయ నివర్తకుడవై, అభిముఖుడవై, స్తుత్యాది సులభోపాయవశ్యుడవైయున్న నీకు ప్రదక్షిణ నమస్కారాదులను చేయనీయక బాధించు విషయములను, తురుష్కయవనాదులను నివర్తింపజేసి, రక్షింపతగును- అని ప్రార్థించుచున్నారని శ్లోకములోని సారార్థము.

అవ :- ఇట్లు సర్వసులభుడైనను, "యం యం వాఽపి స్మరన్ భావం త్యజంత్యంతే కళేబరమ్"అనునట్లు భగవానుని అంతిమకాలమున స్మరించుట సంభవింపనపుడు సర్వభయనివృత్తి కలుగదుకదా ! ఆ అంతిమస్మృతియు, "యం యోగినః ప్రాణవియోగకాలే యత్నేన చిత్తే వినివేశయంతి" అనునట్లు అశక్తునకు దుస్సాధము కదా ! ప్రదక్షిణ ప్రణామాదులకు స్వయత్నము లేనిదే అంతిమస్మృతిని కల్గించు మహిమ కలదా ? ఇవి ప్రవృత్తిని చేయునట్లు ప్రోత్సహించి అంతిమస్మృతిని

కల్గించును అనినచో, ప్రపత్తికి అట్టి మహిమకలదా ? అనిన, కరణకళేబరపాటవము ఉన్నపుడు సకృత్స్మృతిరూపమైన ప్రపత్తిని అనుష్ఠించినవానికి ఆ ప్రపత్తియే పురుష యత్నము లేకనే అంతిమస్మృతిని కల్గించి, సర్వభయనివృత్తిని కలుగచేయునని దేశికులు ఇందు పల్కుచున్నారు. పూర్వశ్లోకమున పరంపరోపాయ వైభవమును తెలుపగా, ఇందు సాక్షాత్ ఉపాయమైన ప్రపత్తి వైభవమును గూర్చి పల్కుచున్నారు.

స్థితే మనసి విగ్రహే గుణిని ధాతుసామ్యే సతి
స్మరే దఖిలదేహినం య ఇహ జాతుచిత్ త్వా మజమ్ ।
తయైవ ఖలు సంధయా త మథ దీర్ఘనిద్రావశం
స్వయం విహితసంస్మృతిః నయసి ధామ నైశ్శ్రేయసమ్ ॥ 6 ॥

ఇహ = ఈలోకమున, యః = ఎవడు, మనసి = (తన) మనస్సు, స్థితే = స్వాధీనమున నున్నపుడు, విగ్రహే = (తన) శరీరము, గుణిని సతి = సద్గుణములను కల్గియున్నపుడు, ధాతుసామ్యే సతి = కఫవాతపిత్తాదులు సమముగా నున్నపుడు, అజం = నిత్యుడవగు, త్వాం = నిన్ను, జాతుచిత్ = ఎపుడైన ఒకసారి, స్మరేత్ = స్మరించునో, అథ = పిమ్మట, దీర్ఘనిద్రావశం = మరణమునకు వశుడైయున్న, తం = అతనిని, తయా+ఏవ= ఆ, సంధయా = స్మృతిచేతనే, స్వయం = తాను, విహితసంస్మృతిః = చేయబడిన అంతిమస్మృతిని కల్గినవాడవై, నైశ్శ్రేయసం ధామ = మోక్షస్థానమును, నయసి ఖలు= పొందించుచున్నావుకదా!

ఎవడు, మిక్కిలి చంచలమగు మనస్సు పురుషార్థవిషయమున స్వచ్ఛమైన జ్ఞానమును, నిశ్చయమును కల్గియుండునట్లు ప్రతిష్ఠితమై, శరీరము పురుషార్థమున రుచి కలుగుటకు అనుగుణమై, కఫము మొదలగు ధాతువులు తమతమ స్థితులలో నున్నవై యున్నపుడు చేతనాచేతనశరీరివి, నిత్యుడవును అగు నీ విషయమున ఒకపర్యాయము ప్రపత్తిని చేయుచున్నాడో, నీవు అతని మరణకాలమున అతనికి నీ విషయమైన స్మృతిని కలుగజేసి, మోక్షము లభించునట్లు చేయుచున్నావు.

(మనసి)- "చంచలం హి మనః కృష్ణ" అనియు, "అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్" అనియు చెప్పబడినట్లు వానరమువలె బంధించినను తన కాపేయము (చాంచల్యమును) విడువని మనస్సు- అని భావము.

(స్థితే సతి) - "సతి" అనునది అధ్యాహృతము. విషయాంతరప్రవణముకాక స్వాధీనమైయున్నపుడు- అని భావము. సర్వస్మృతులకును మనస్సులో స్థితి

ఆవశ్యకముకదా ! ప్రత్యేకించి "స్థితే మనసి" అని అనవసిన అవసర మేమి? అనినచో,- అతిచంచలమైన మనస్సు సుకృతవిశేషముచే ఏర్పడు సత్త్వోన్మేషవశమున సదాచార్యోపదిష్టములగు పరమతత్త్వహితపురుషార్థములందు స్వచ్ఛమైన, స్పష్టమైన జ్ఞానము, నిశ్చయమును కల్గునట్లు ప్రతిష్ఠితమై యుండవలయుననుటకై "స్థితే మనసి" అని ప్రయోగింపబడినది

(విగ్రహే గుణిని సతి) - శరీరము పటుత్వాదిగుణమును కల్గియున్నపుడు- అని భావము. శరీరమునకు గుణత్వ మేమనగా - సత్త్వగుణముయొక్క ఉన్మేషమువలన పురుషార్థమునందు రుచి కల్గుటకు అనుగుణము అగుటయే.

(ధాతుసామ్యే సతి)- కఫవాత పిత్తములు సమముగా నున్నపుడు. అనగా - తమతమ పరిమితులలో నున్నపుడు - అని భావము. అనగా- వాతము ఒక భాగము, పిత్తము సగభాగము, కఫము నాల్గవభాగమును ఉండుటయే. అంతియే తప్ప మూడును సమముగా నుండుట అని అర్థము కాదు. ఎందులకనగా - కఫవాతపిత్తములు మూడును సమముగా నున్నచో విపరీతఫలము కలుగునని వైద్యశాస్త్రము తెలుపుచున్నది. కావున ముందు తెలుపబడిన ప్రదక్షిణనమస్కారాదులు ఉపాయవిరోధులను పోగొట్టుటయేకాక, ప్రపత్తిని అనుష్ఠించు క్షణమున కరణకళేబరమనశ్శుద్ధ్యాదులను కల్గించి, ఉపకరించునని ఏర్పడుచున్నది.

(అఖిలదేహినమ్) - సర్వాంతర్యామిని- అని అర్థము

(అజమ్) - నిత్యుడైన- అని అర్థము. స్మృతిరూపమగు ప్రపత్తి ఆత్మైకవేద్య మగుటచే ప్రపత్తి చేయబడువానికి (ప్రపత్తవ్యునకు) తెలియునా ? మనవలె అతడు అనిత్యుడైనచో మనలను అతడు రక్షించునా ? అనినచో, అతడు సర్వాంతరాత్మ అగుటచే రక్షింపగలడని తెలుపబడినట్లయినది. స్మృతిరూపమైన ప్రపత్తిని చేయు ముముక్షువునకు అతడు తప్ప వేఱొకరు ఆశ్రయణీయులు కారనుటకు, అతనిని ఆశ్రయించియే మోక్షమును పొందవలయుననుటకును ఈ ప్రపత్తికి లక్ష్యమైన విషయములను పర్వతసౌలభ్యప్రతిష్ఠాపకములగు మూడు పదములద్వారా తెలుపుచున్నారు. "అఖిల దేహినమ్" అనుటచే సమస్తవిశ్వమును తనకు శరీరముగా కల్గినవాడని తెలుపబడినది. ఇందుచే సర్వశేషియై, సర్వనియంతయై, సర్వమునకు ఆధారభూతుడై, అందువలన సర్వముయొక్క సత్తాస్థితిప్రవృత్తులు తన అధీనములోనున్నవాడై, కైంకర్యమునకు ఉద్దేశ్యభూతుడై, తన ప్రయోజనముకొఱకు సాధుపరిత్రాణము మొదలగువానిని

చేయువాడై, ఆశ్రయణీయుడై, సర్వత్రవ్యాపించి యున్నవాడగుటచే తనను ఆశ్రయించు వానికి నిత్యసన్నిహితుడై యుండుననియు ధ్వనించుచున్నది. "అఖిలదేహినమ్" అను పదమున తెలుపబడిన సర్వశరీరకత్త్వముచే, తత్ఫలితములగు సర్వోపదానత్త్వ-నిమిత్తత్త్వములచే చేతనాచేతన దోషములన్నియు భగవానునకు కల్గునేమోనను సందేహము ఏర్పడవచ్చునుకదా ! - అనినచో, అందుకు సమాధానముగా వెంటనే "అజమ్" అని పల్కిరి. పురుషాంతరసజాతీయ జన్మనిషేధముచే భగవానుని హేయప్రతిభటత్త్వము సూచింపబడినది. ఇచట జన్మను నిషేధించుటద్వారా మిగిలిన చేతనాచేతనగతములైన దోషము లేమియు లేవనుట ఉపలక్షింపబడినది. "చరాచరాణి భూతాని సర్వాణి భగవద్వపుః, అత స్తదానుకూల్యం మే కర్తవ్య మితి మే మతిః" అనునట్లు సర్వ శరీరకత్త్వమును తెలుపుటచే ఆనుకూల్యసంకల్ప- ప్రాతికూల్యవర్జనములు చెప్పబడినవి. అందుచే ఇచట మహావిశ్వాసమును సిద్ధము.

(త్వామ్) - వాత్సల్యస్వామిత్వాది గుణవిశిష్టుడవగు నిన్ను. "అర్చ్యః సర్వసహిష్ణుః అర్చకపరాధీనాఖిలాత్మస్థితిః" అనునట్లు సర్వాపరాధసహిష్ణువై, నీ ఆసనభోజనాదులు వారి అధీనములై, వానిని వారివలన గ్రహించి, తృప్తుడవై, "నల్లదోరరుళ్ తన్నాలే కాట్టినాన్ తిరువరఙ్గమ్ ఉయ్‌బవర్క్కుయ్యుమ్ వణ్ణమ్" అనునట్లు ఉజ్జీవనార్థులకు "శ్రీరంగమును ఆశ్రయించుటయే పరమహితము" అని తన సహజకృపతో చూపిన నిన్ను - అని భావము. "అఖిలదేహినం త్వామ్" అను పదములవలన జగద్ధితావతారత్త్వ -శరణ్యత్త్వ - ప్రాప్యత్వోపయుక్తమగు సర్వకల్యాణగుణాకరత్త్వము సిద్ధించును.

(జాతుచిత్ యః స్మరేత్) - "యః" అనుటచే "అన్దణరన్దియర్" అనునట్లు వసిష్ఠ - చండాల తారతమ్యరహితముగా ఆకించన్యమును కల్గినవారు అందఱు ప్రపత్తిని చేయనగునని సూచితము. "జాతుచిత్ స్మరేత్" అని సకృదావృత్తమైన ప్రపత్తిరూపస్మృతి తెలుపబడినది. ప్రపత్తి సకృదావృత్తస్మృతిరూపమనుటను శ్రీమద్రహస్యత్రయసారమున చూడనగును. ఇచట ప్రపత్తి అని తెలుపక కేవలస్మృతిని తెలుపునపుడు కేవలస్మృతికి వేఱొక ఉపాయముయొక్క అవసరములేకనే అంతిమస్మృతిని కల్గించి, మోక్షహేతు వగుటకు అవకాశము లేకపోవుటచే, "తయైవ ఖలు సంధయా" ఇత్యాదిసూక్తిచే అంతిమస్మృతి పూర్వకముగా మోక్షమును అనుగ్రహించుననుటలో విరోధము ఏర్పడును. కావున "స్మరేత్" అనుచు ప్రపత్తిని తెలుపబడినది.

(అథ దీర్ఘనిద్రావశమ్) - మరణవివశుడై, జ్ఞానశూన్యుడైన ఆ మానవుని- అని భావము.

(తన్యైవ ఖలు సంధయా) - పూర్వము అనుష్ఠించిన ప్రపత్తిరూపమైన స్మృతివలన.

(స్వయం విహితసంస్మృతిః) - వేఱు ప్రయత్నము లేక, "కేవలం తదీయయైవ దయయా" అనునట్లు తానే అంతిమస్మృతిని కలుగజేయువాడై -

(నైశ్శ్రేయసం ధామ) - మోక్షస్థానమును.

(నయసి) - పొందించుచున్నావు. ఇది ద్వికర్మకర్తరి ప్రయోగము.

ఆతివాహికులతో నీవును ఒకడవై, వారిలో ప్రధానుడవై కొనిపోదువు- అని తాత్పర్యము. నిత్యానుభవమును పొందుటకు అభిలషించు జీవునికంటె ఎక్కువగా భగవానుడు నిత్యానుభవమును అనుగ్రహించుటకు అభిలషించుననుటకు "తన్యైవ ఖలు సంధయా త మథ దీర్ఘనిద్రావశం స్వయం విహితసంస్మృతిః" అనుచు తెలిపిరి.

(నయసి ధామ నైశ్శ్రేయసమ్) - అనుటవలన బురదలోపడిన చిన్నపిల్లవానిని పైకి తీసికొనివచ్చుటకు ఆ పంకములోనికి దిగిన తండ్రివలె, జీవుని దేహమునందు హార్దుడై నిలచియున్న నీవే అప్రాకృతపర్యంకారోహణమువరకు కొనిపోవుచున్నావు అను తాత్పర్యము తోచును. పూర్వము తెలిపిన ప్రపత్తి సకలఫలసాధనమైనను, అనన్యప్రయోజనుడగు భక్తునకు ఐశ్వర్యాది రూపక్షుద్రఫలవ్యవహితముగా మోక్షమును ఇవ్వవు అని, అవ్యవహితముగా పరమపురుషార్థరూపమైన మోక్షమును ఇచ్చుననెడి విశేషమును స్ఫురించునట్లు, "నైశ్శ్రేయసం ధామ"అని పల్కిరి. "స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః, ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మా మజమ్, తతస్తం మ్రియమాణం తు కాష్ఠపాషాణసన్నిభమ్, అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్" అను శ్లోకము ఇచట అనుసంధేయము. ఈ శ్లోకము దేశికులచే రహస్యశిఖామణి అను రహస్యగ్రంథమున వివరింపబడినది. అధమస్త్రీవివశుడగు పుత్రుని ప్రభువు ఉత్తమస్త్రీ సహాయముతో తీర్చిదిద్ది అభిషేకమును చేయునట్లు జీవుని భగవానుడు అనుగ్రహించునను భావము - "దీర్ఘనిద్రావశం తన్యైవ ఖలు సంధయా" అను స్త్రీలింగపదప్రయోగములవలన ద్యోతితమగును.

అవ :- ఎంతటి పాపిష్ఠివాడైనను ఒకసారి ప్రపత్తిని చేసినచో నరక ప్రాప్తిలేకుండ అతనికి మోక్షమును ఇచ్చునను మహిమ ప్రపత్తికి కలదా ? అనినచో, కేవల భగవన్నామ సంకీర్తనమునకుకల మహిమను గమనించిన శరణ్యాశరణాగతి యొక్క మహిమ కింపునః

న్యాయముచే సిద్ధముకదా ! -అను అభిప్రాయముతో భగవన్నామసంకీర్తనమహిమను ప్రస్తుతశ్లోకమున తెలుపుచున్నారు.

రమాదయిత రంగభూరమణ కృష్ణ విష్ణో హరే
త్రివిక్రమ జనార్దన త్రియుగ నాథ నారాయణ ।
ఇతీవ శుభదాని యః పఠతి నామధేయాని తే
న తస్య యమవశ్యతా నరకపాతభీతిః కుతః ॥ 7 ॥

యః = ఎవడు, రమాదయిత = లక్ష్మీనాథా, రంగభూరమణ = శ్రీరంగనాథా, కృష్ణ = శ్రీకృష్ణా!, విష్ణో= విష్ణుదేవా, హరే = హరీ !, త్రివిక్రమ= త్రివిక్రమా!, జనార్దన = జనార్దనా, త్రియుగ = షాడ్గుణ్యపరిపూర్ణుడా !, నాథ = స్వామీ!, నారాయణ = నారాయణా!, ఇతి+ఇవ = ఇట్లు ఈవిధముగా, శుభదాని = శుభమును ఇచ్చు, తే = నీయొక్క, నామధేయాని =నామములను, పఠతి = చెప్పుచున్నాడో, తస్య = అతనికి, యమవశ్యతా = యమునకు వశుడగుట, న = లేదు, నరకపాతభీతిః= నరకమున పడుదునేమో?అను భయము, కుతః= ఎక్కడ? (లేదని భావము).

ఎవడు నీ నామములను కీర్తించునో అతడు యమునకు వశుడు కాదు. ఇక, నరకమునకు పోవు పని ఏమి ? అని తాత్పర్యము.

భగవానుని నామోచ్చారణమును చేసినను పాపములను చేసినచో నరకము వచ్చునుకదా ! అనినచో, యమునకు వశుడైనకదా నరకప్రాప్తి కల్గుట ! "న ఖలు భాగవతా యమవిషయం గచ్ఛంతి" అనునట్లు వారికి యమవశ్యత లేదుకదా ! "అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః, పుమాన్ విముచ్యతే జంతుః సింహత్రస్తైః మృగై రివ" అని అవశముగానైనను భగవన్నామమును పల్కినచో సింహమును చూచిన మృగమువలె పాపములు పాఱిపోవునని మహర్షులు పల్కుటయే కాక, ఆళ్వార్లును "మొయ్త్త వల్ వినైయుళ్నిన్టు మూన్టెళుత్తుడైయపేరాల్ కత్తిరబన్దుమన్టే పరాఙ్గతి కణ్డుకొణ్డాన్" అనుచు పాపిష్ఠుడైన క్షత్రబంధువుకూడ గోవిందా అను మూడక్షరములను కలనామమును ఉచ్చరించుటచే పరమపదమును పొందెనని, "నమన్టమర్ తలైకణ్మిదే మూవుల కుణ్డుమిళ్న్ద ముదల్వ నిన్నామమ్ కత్త ఆరలిప్పుడైమైకణ్డాయ్ అరఙ్గమానకరుళానే" అని భగవన్నామ స్మరణముయొక్క మహిమవలన యముని తలపై కాలును పెట్టితిననియు పల్కిరి. మఱియు"కులన్దరుమ్" అను పాశురమున పరకాలసూరి నారాయణనామము కులమును, సంపదను, మిగిలిన అన్నిటిని ఇచ్చుననుటయేకాక, "పెత్తతాయునుమాయిన శెయ్యుమ్" అని తల్లివలె సకలశుశ్రూషను చేయునని పల్కిరి.

(రమాదయిత) - "రమాయాః దయితః" అని కాని, "రమా దయితా యస్య సః" అని కాని విగ్రహమును చెప్పవచ్చును. ఇట్లు తత్పురుష- బహువ్రీహి సమాసము ద్వయములవలన "అస్యా దేవ్యా మన స్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్" అని స్వామికి లక్ష్మి ప్రియ మగుట, ఆమెకు స్వామి ప్రియుడగుట- అను ఐకరస్యమును కల్గినవారని తెలుపబడినది. మఱియు "అకలకిల్లేన్ ఇఱైయు మెన్తు అలర్మేల్మఙ్గైయుఱైమార్బా" అనునట్లు ఈమె స్వామి వక్షఃస్థలమును అనురాగాతిశయమువలన తన నివాసస్థానముగా చేసికొనునట్లు, అతడును "పిత్తర్ పనిమలర్ పావైక్కు" అనునట్లు, "మలరాళ్తవత్తుళ్లాన్" అనునట్లును ఆమె విషయమున అత్యంతవ్యామోహమును కల్గియున్నవాడై ఆమె వక్షః స్థలమును తన నివాసముగా కల్గియుండుటయు తెలుపబడినది. అంతియేకాక, "పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ, . . .న కశ్చి న్నాపరాధ్యతి", "మర్షయా మీహ దుర్బలాః" అనుచు సీతాదేవి పలుకగా, అతడును (భగవానుడు) -"ఎన్నడియార్ అదుశెయ్యార్ శెయ్దారేల్ నన్తు శెయ్దారెన్బర్పోలుమ్" అని పల్కెను. శరణాగతుడగు విభీషణుని విషయమున సందేహించిన సుగ్రీవునకు శ్రీరాముడు "శ్రూయతే హి కపోతేన శత్రు శ్శరణ మాగతః, అర్చిత శ్చ యథాన్యాయం స్వై శ్చ మాం సై ర్నిమంత్రితః" అనుచు కపోతోపాఖ్యానమును తెలిపి, అతని మనస్సును మార్చినట్లే, సీతాదేవియు ఆర్ద్రాపరాధినులగు రాక్షసస్త్రీలను శిక్షింపదొడగిన హనుమానుని "అయం వ్యాఘ్రసమీపే తు పురాణో ధర్మసంస్థితిః, ఋక్షేణ గీతశ్లోకో మే తన్నిబోధ ప్లవంగమ, న పరః పాప మాదత్తే పరేషాం పాపధర్మిణామ్, సమయో రక్షితవ్య స్తు సంత శ్చారిత్రభూషణాః" అని ఋక్షవ్యాఘ్రోపాఖ్యానమును తెలిపి, అతని మనస్సును మార్చెను. కావున ఇరువురును ఆశ్రితపక్షపాతమున ఐకరస్యమును కల్గియుండుట స్పష్టము.

(రంగభూరమణ) - "రంగభువి రమణం యస్య సః" అను విగ్రహము వలన శ్రీరంగక్షేత్రమున మిక్కిలి ప్రీతిని కల్గినవాడను అర్థము ఏర్పడును. చిరకాలము నిరాహారుడైయున్నవాడు అన్నసత్రమును చూచినచో ఆనందాతిశయమున అచటనే పడియుండి, సుఖించునట్లే, శ్రీవైకుంఠమున రక్షింపతగినవారు ఎవ్వరును లేకుండుటచే నష్టపోయినవానివలెనున్న భగవానునకు ఈ ప్రకృతిమండలమున శ్రీరంగాదిస్థలము లందు "అతి నీచై స్సహ నీరంధ్రేణ సంశ్లేషః" అని నిర్వచింపబడిన సౌశీల్యగుణముయొక్క ఆవిష్కారమునకు తగిన చోటు (దేశలాభము), రక్ష్యవస్తులాభమును అనేకముగా లభించుటచే, ముక్తుడు శ్రీవైకుంఠమునందు తాను కోఱిన విషయములయొక్క

లాభమువలన సంసారమును మఱచినట్లు, భగవానుడును ఇచట తాను అభిలషించిన విషయముయొక్క లాభమువలన శ్రీవైకుంఠమును మఱచి ఇచట ఆనందించుచు అవశముగా పడియున్నాడని తాత్పర్యము. లేక, "రంగభూ" అను పదము "మంచా: క్రోశంతి" అనునపుడువలె శ్రీరంగములోని జనులను నిర్దేశించునని చెప్పినచో, "రంగభువ: రమణ:" అను విగ్రహమువలన శ్రీరంగములోని జనులకు రమణుడైయున్నవాడని భావము కల్గును. శ్రీరంగమునకల జనులు, శ్రీరంగనాథుని క్షణమైనను విశ్లేషించినచో, "విషయే తే మహారాజ రామవ్యసనకర్మితా:, అపి వృక్షా: పరిమ్లానా: సపుష్పాంకురకోరకా: " అని కోసలజనపదములలోని ప్రాణులన్నియు శ్రీరాముని విరహమును సహింపలేక పరితపించినట్లు, గొప్ప క్లేశమును పొందు ప్రకృతిని కల్గినవారై, శ్రీరంగనాథుని దర్శించి సేవించుచు సంతోషించుచున్నారని తాత్పర్యము. "రంగభువి రమణం యస్య" అను విగ్రహమును చెప్పిన శ్రీరంగమును ఆశ్రయించిన జనులను క్షణమైనను విడచి ఉండలేక "స ఏకాకీ న రమేత" అని "క్వచి దుద్భ్రమతే వేగాత్ క్వచిత్ విభ్రమతే బలాత్, క్వచి న్మత్త ఇవాభాతి కాంతాన్వేషణతత్పర:" అనునట్లు తనకు సంతోషము లేక పిచ్చెత్తినవాని అవస్థను పొందినవాడై ఆ శ్రీరంగమున నివసించు జనులతో ఆనందించుచున్నాడని భావము.

ఈ అర్థమును "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమ్ అహం స చ మమ ప్రియ:" అని గీతాచార్యుడు తెలిపెను. జ్ఞానికి నేను అత్యంతము ప్రియుడను, నాకు అతడు కేవలము ప్రియుడు, జ్ఞాని నాపట్ల గొప్ప ప్రీతిని కల్గినవాడు. దానికి తగిన ప్రీతిని నేను అతని విషయమున కల్గియుండలేదు. కేవలము ప్రీతిని మాత్రమే కల్గియుంటినని శోకించుచున్నాడని ఈ శ్లోకములోని తాత్పర్యము. ఈ అర్థమును దేశికులు తాత్పర్యచంద్రికలో అనుగ్రహించిరి. ఇట్లు - "య మేవైష వృణుతే తేన లభ్య:" అను శ్రుతి పద్ధతికి శ్రీరంగనాథుడును, శ్రీరంగనివాసులును పరస్పరము ప్రీతిని కల్గినవారై ఆనందించుచున్నారని తత్పురుష- బహువ్రీహి సమాసద్వయములవలన తెలుపబడినది. "ఎల్లైయుమ్ కాలైయుమ్" అను తిరువాయ్మొళి దశకములో చివర దశకఫలమును తెలుపునపుడు "ఈ తిరువాయ్మొళిని నేర్చినవారలను స్వామి ఒక్కక్షణము విశ్లేషించినను భరింపలేడు'' అని పిళ్లాన్ అనుగ్రహించిరి. "రంగస్థలనాథ" అనికాని, "రంగక్షేత్రనాథ" అనికాని పలుకక, "రంగభూరమణ" అని పల్కుటచే లక్ష్మీదేవి విషయములోవలె భూదేవి విషయముననుస్వామి అనుభవరసమును కల్గియున్నాడని ధ్వనించును. అపుడు "భువ:

రమణం, భువి రమణం యస్య సః" అను సమాసద్వయమువలన పరస్పరము ఆనందించు విధము తెలుపబడినది. "అహం శిష్యా చ దాసీ చ భక్తా చ త్వయి మాధవ" అని భూదేవి భగవానునిపట్ల భక్తురాలైయున్నట్లు అతడును "పార్వణ్ణ మడమజ్జైపత్తర్ పిత్తర్" అని భూదేవిపట్ల భక్తుడైయుండుటచే, ఇట్లు అన్యోన్యము కలసియున్న విధానమును తెలుపబడినది. ఇట్లు "రమారమణ", "భూరమణ" అని దేవేరులను పురస్కరించుకొని భగవన్నామమును యాదృచ్ఛికముగా చెప్పినను వారి ముఖోల్లాసమునకై, సంసారులు ఎంతటి పాపిష్ఠులైనను వారిని యథార్థముగనే లక్ష్మీదేవిచే పరిగ్రహింపబడినవారిని ఎట్లు కటాక్షించునో, అట్లే కటాక్షించి మనలను వారి దగ్గఱకు భగవానుడు రానివ్వడు- అని యముడు సపరివారముగ పాఱిపోవును. ఇట్లుండగా, నరకప్రాప్తికి అవకాశ మేమి కలదు ? అని తాత్పర్యము. తిరువాయ్మొళి ప్రబంధమున సమానప్రకరణమున - "మాదవనెన్దదే కొణ్డు ఎన్నై యిని యిప్పాల్ప్పట్టదు" అను పాశురమునకు పిళ్లాన్ "యదృచ్ఛయా పిరాట్టి పరిగ్రహించినవారు పల్కు మాట నొకటిని నేను పల్కినంతనే, దానినే నిజముగా సహృదయముగా పల్కినట్లు తలచి, భగవానుడు లక్ష్మీదేవి పరిగ్రహించినవానిని తానెట్లు అనుగ్రహించునో, అట్టి కరుణాదృష్టితో నన్ను అనుగ్రహించెను." అని వ్యాఖ్యానించిరి. ఇట్లు తత్పురుష బహువ్రీహి సమాసముల అర్థములు అన్నియు ప్రమాణసిద్ధములగుటచే ఒక అర్థము శాబ్దము, మిగిలిన అర్థములు ఆర్థము లగుట, లేక పదముల ఆవృత్తిచే సిద్ధించుటయు ఈ సందర్భమున వివక్షితము. అందుచే "సకృదుచ్చరితః" అను న్యాయమునకు విరోధము లేదు. "కప్యాసం పుండరీకమ్" అను శ్రుతికి "గంభీరాంభస్సముద్భూత సుమృష్టనాళరవికరవికసిత-పుండరీక" అని పదముల ఆవృత్తిచే అర్థమును చెప్పనగునని, మూలమంత్రమున నారాయణాదిపదములందు తెలుపబడిన అనేకార్థములలో ఒక అర్థము శాబ్దముగా, తక్కిన అర్థములు ఆర్థములుగా గ్రహింపనగునని ఆచార్యులు వివరించిరికదా !

(కృష్ణ) - రాక్షసులచే పీడింపబడిన దండకారణ్యావాసులగు మునులు తమ కష్టమును ఒక మాటతో తెలుపుటకాక, "ఏహి పశ్య శరీరాణి మునీనాం భావితాత్మనామ్" అనుచు చూపి శ్రీరాముని రక్షింప వేడినట్లు, "హే కృష్ణ ద్వారకావాస క్వాసి యాదవనందన, ఇమా మవస్థాం సంప్రాప్తా మనాథాం కి ముపేక్షసే" అని దుశ్శాసనునిచే బాధింపబడిన ద్రౌపది పిలచినపుడు తన కష్టమును ఒకమాటతో వ్యక్తీకరించుటకాక, "ఇమా మవస్థాం సంప్రాప్తామ్" అనుచు తెలిపి కృష్ణనామమును ఉచ్చరింపగా, ఆ సమయములోని ఆపదను

తొలగించినవాడైను "ఋణం ప్రవృద్ధ మివ మే హృదయా న్నాపసర్పతి" అని పల్కిన స్వామి, కృష్ణనామముతో పిలచిన తన భక్తునివద్దకు నన్ను వెళ్లనీయునా? అని యముడు పరివారముగ దూరముగా పాఱిపోవును.

(విష్ణో) - "విష్ల్ -వ్యాప్తౌ" అని ఎల్లెడల పరిపూర్ణుడై నిండుగా నుండువాడు అని భావము. పరమపదము, పాలకడలి మొదలగు వ్యవహితస్థలములలోనుండువానికి జీవుడు చేయు ఆర్తనాదము చెవికి సోకునా ? మిక్కిలి దూరముగానున్న ఈ చోటికి అతడు వచ్చునా ? ఈ జీవుని బంధించి, తీసికొనిపోయెదను" అని తలచినను "ఎఙ్గు ముళన్ కణ్ణన్" అని పల్కిన ప్రహ్లాదుని బాధించినవాడగు హిరణ్యకశిపుని స్తంభమునుండి అవతరించి నిగ్రహించినట్లు సర్వవ్యాపి యగు విష్ణువు ఏదైన ఒక స్తంభమున నిలచి యైనను, తృణముననుండియైనను అవతరించి మనలను నిగ్రహించునని, యముడు విష్ణునామోచ్చారణమును చేసినవాని వద్దకు ఎన్నడును పోడు అని తాత్పర్యము.

(హరే) - "హరి ర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః" అనునట్లు సర్వ పాపహరమగు హరినామమును స్మరించినవానివద్ద పాపములు నిలచునా ? పాపములున్న కదా యమవశ్యత కలుగుట- అని తాత్పర్యము.

(త్రివిక్రమ) - మాటమాత్రమే ఆధారముగా గొని భగవానుడు రక్షించునా ఏమి ? అనినచో, పలుకుటకూడ తెలియని సకలచేతనాచేతనముల తలపై స్పృహణీయమైన తన పాదద్వంద్వమును పెట్టినవాడు అతని నామమును పల్కిన వాని చేయి విడచునా ? -అని భావము. ఈ అభిప్రాయముతోనే ఆళవన్దార్ (యామునులు) "త్రివిక్రమ త్వచ్చరణాంబుజద్వయం మదీయమూర్ధాన మలంకరిష్యతి" అని పల్కిరి.

(జనార్దన) - సముద్రమధ్యముననున్న జనుడను పేరును కల అసురుని నిగ్రహించినవాడగుటచే జనార్దనుడను పేరును కలవాని నామమును ఉచ్చరించిన, జనుడను అసురుని నిగ్రహించినట్లు యముని నిరసించును- అని ఇచటి భావము.

(త్రియుగ) - "త్రీణి యుగాని యస్య సః" అని విగ్రహవాక్యము. జ్ఞానశక్తి బలైశ్వర్యవీర్యతేజస్సులను ఆఱు గుణములచే పరిపూర్ణుడని భావము. "గుణై ష్షడ్భి ర్త్వేతైః ప్రథమతరమూర్తి స్తవ బభౌ తత స్తిస్ర స్తేషాం త్రియుగయుగలై ర్హిభి రభుః" అను శ్లోక మిచట అనుసంధేయము. ఇట్లు షాడ్గుణ్యసంపూర్ణత్వ ప్రతిపాదకమగు "త్రియుగ" నామమును పల్కినచో వీర్యశక్త్యాదుల సహాయముతో యముని నిగ్రహించునని భావము.

(నాథ) - కృష్ణా! విష్ణూ ! అని అసాధారణములైన నామములను పలుకక గజేంద్రుడు "ఆదిమూలమా!" అని సాధారణముగా పిలచినట్లు "నాథ" అని సాధారణముగా పిలచినను భగవానుడే సర్వలోకనాథుడగుటచే యమబాధ కలుగకుండ రక్షించునని భావము.

(నారాయణ) - శేషశేషిభావ- కార్యకారణభావ- శరీరాత్మభావాదులనెడి సంబంధములను ప్రతిపాదించు నారాయణశబ్దముతో పిలచినచో స్వామి సొత్తును రక్షించునట్ల తన సొత్తు అగు మనలను యముని చేతిలో పెట్టక రక్షించునని తాత్పర్యము.

(ఇతీవ) - ఇట్లు (పలు విధములగా) నున్న

(శుభదాని తే నామధేయాని) - "నామాని సర్వాణి సుమంగళాని తే" అనునట్లు మంగళప్రదములగు నీ నామములను.

(యః) - ఏ పురుషుడైనను- అని అర్థము. నీచోచ్చభేదములేక ఏ చేతనుడైనను.

(పఠతి) - అర్థజ్ఞానములేక కేవలము పఠించినను -

(తస్య యమవశ్యతా) -అతనికి యమవశ్యత లేదు.

(నరకపాతభీతిః కుతః) - నరకమున పడుదు మను భయము ఏకారణముచే కల్గును ? అని భావము. యమవశ్యత ఉన్నచోకదా నరకప్రాప్తి సంభవించుట. "సర్వేకస్మై దేవా బలి మావహంతి" అనునట్లు భగవానునకు యమాదిదేవతలు వశ్యులైయుందురు. ఇట్లు నీ నామములకు మహిమ ఉన్నచో ప్రపత్తికి మహిమ కైముత్యన్యాయముచే సిద్ధముకదా! ఇట్టి ప్రపత్తిని నేను అనుష్ఠింపగా, ఒకయమునివలెకాక అయిదుగురు యములవలెనుండు విషయపంచకములకు నన్ను వశ్యునిగా చేసి, రౌరవాదినరకానుభవ దుఃఖముకంటె కఠినమైన నీ అనుభవము రాహిత్యముచే కల్గిన మహాదుఃఖమును అనుభవించునట్లు చేయతగునా? అని కవి హృదయము.

అవ :- "భగవన్నామములకు ఇట్టి మహిమ కలదనుట ఒక విశేషమా భగవానునిచే అధిష్ఠింపబడిన ఊరియొక్క మహిమను చూచినచో!" అను అభిప్రాయమును వ్యక్తీకరించుచు దేశికులు ఈ క్రిందిశ్లోకమును పల్కుచున్నారు.

కదాచిదపి రంగభూరసిక యత్ర దేశే వశీ
త్వదేకనియతాశయ స్త్రిదశవందితో వర్తతే ।
తదక్షతతపోవనం తవ చ రాజధానీ స్థిరా
సుఖస్య సుఖ మాస్పదం సుచరితస్య దుర్గం మహత్ ॥ 8 ॥

రంగభూరసిక = శ్రీరంగభూమియందు ఆనందించువాడా !, వశీ = జితేంద్రియుడై, త్వత్+ఏకనియతాశయః = నీ విషయమందే స్థిరమైన హృదయమును కలవాడై, త్రిదశవందితః= దేవతలచే పూజింపబడువాడైన ఒక భాగవతుడు, యత్ర దేశే = ఏ దేశమున, కదాచిత్+అపి = ఎపుడైనను, వర్తతే =ఉండునో, తత్ = ఆ ప్రదేశము, అక్షతతపోవనం = విఘ్నములు లేని తపోవనము, తవ చ = నీకును, స్థిరా = స్థిరమైన, రాజధానీ = ముఖ్యపట్టణము, సుఖస్య = మోక్షసుఖమునకు, సుఖం = సుఖమైన, ఆస్పదం = చోటు, సుచరితస్య = గొప్ప ధర్మమునకు, మహత్ = గొప్ప, దుర్గం = కోట.

శ్రీరంగభూమియందు ఆనందించువాడా ! జితేంద్రియుడై, నీ విషయమునందు మాత్రమే స్థిరమైన మనస్సును కలవాడగు మహానుభావుడు ఒకడు ఏ దేశములోనైన ఎపుడైనను నివసించినచో, ఆ దేశమే ఎట్టి ఆటంకములు కలుగని తపోవనము. అదియే నీకు వైకుంఠముకంటెను గొప్పదైన రాజధాని. సుఖములకన్నిటిలో సుఖమైన చోటు అదియే. భగవత్కైంకర్యమను సత్ప్రవర్తనకు విరోధమైన రజస్సు, తమస్సు మొదలగువానివలన ఆటంకములు కలుగకుండుటనట్లు రక్షించు కోట అదియే.

(రంగభూరసిక) - శ్రీరంగక్షేత్రమున రాసిక్యమును కలవాడా ! కాముకునకు కామిని ఉన్న చోటు రుచించునట్లు సౌశీల్యాద్యావిష్కృతి కాముకుడవగు నీకు తగిన విషయములున్న దేశమగుచే అందు రాసిక్యమును కలిగియున్నావని భావము. "భవద్విషయవాసినః" అని, "తేనైష పూర్వ మాక్రాంత ఆశ్రయ శ్శ్రమనాశనః, మయా పి భక్త్యా తస్యైష వా మనస్యోపభుజ్యతే"అనియు నీకు రుచించిన దేశము విశ్వామిత్రాది మునులకు ఇష్టపడినట్లు, "సైకతే హంసజుష్టే" అని అగస్త్యాదులకు, తొణ్డరడిప్పొడి ఆళ్వార్ మొదలగువారికిని ఇష్టపడిన దేశమగుటచే అందు నీకు రాసిక్యము ఉన్నదని భావము. "మునయ శ్చ మహాత్మానః వసంత్యస్మిన్ శిలోచ్చయే,అయం వాసో భవే త్తావ దత్ర సౌమ్య వసేమహి" అని మునులకు రుచించిన చిత్రకూటము నీకును రుచించెనుకదా! ఇట్లు పరమభాగవతులగు తొణ్డరడిప్పొడిఆళ్వార్ మొదలగువారు వేంచేసియున్న దేశమగుటచే వారు అవతారమును చాలించిన పిమ్మటను రాసిక్యాతిశయము వలన ఆ దేశమగు శ్రీరంగమును విడువక, "తస్యాః పుష్పమయీ శరీరలులితా శయ్యా శిలాయా మియమ్" అని శకుంతలచే పూర్వము అధిష్ఠితమైన దేశమును విడువక దుష్యంతమహారాజు పడియుండినట్లు, శ్రీరంగదేశమున పడియున్నావని తాత్పర్యము.

(వశీ) - జితేంద్రియుడై.

(త్వదేకనియతాశయః) -నీయందుమాత్రమే స్థిరమైన హృదయమును కల్గినవాడని భావము. అంతరింద్రియములను, బహిరింద్రియములను అణచి, వేఱొకనిని శరణ్యునిగా వరించుట మాని, ప్రయోజనాంతర రుచిని వీడి, ప్రాప్యముగా, ప్రాపకముగా నిన్ను వరించి, నీ అనుభవమునందు మాత్రమే ప్రావణ్యమునుకల మనస్సును కల్గియున్న పురుషుడు - అని భావము.

(త్రిదశవందితః)- దేవతలచే నమస్కరింపబడినవాడై, చిరకాలము దేవతలకు ఋణియై, యాగాదులచే వారిని ఆరాధించి, స్వర్గమును చేరి, ఎద్దు పరదేశమునకు పోయిన రీతిలో "దేవానాం పశుః" అనునట్లు వారికి బాధపడుచు సేవజేయువాడు "జాయమానం హి పురుషం యం పశ్యే న్మధుసూదనః, సాత్త్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః" అను రీతిలో జాయమానదశలో భగవత్కటాక్షమును పొంది, భగవద్భక్తినికల్గి, "స త్వం ప్రహరవామా వా మయి వజ్రం పురందర, నాహ ముత్సృజ్య గోవింద మన్య మారాధయామి భోః" అని దేవతలను ఆరాధింపకున్నను పూర్వము ఆరాధింపబడిన ఆ దేవలందఱు"సర్వేస్మై దేవా బలి మావహంతి" అనునట్లు కానుకలను సమర్పించి, నమస్కరించి, ఇతనిని పూజింతురు. ఈ అర్థమును "యో మే ప్రగాయతే గేయం మమ భక్త్యా వ్యవస్థితః, నిత్యం పశ్యతి వై శక్రం వజ్రహస్తం న సంశయః" అను శ్లోకవ్యాఖ్యానమున భట్టరు, స్వర్గమునకు పాలకుడగు దేవేంద్రుడు వజ్రపాణియై సేవించుచు నిలువగా, అపాంగవీక్షణముతో అతనిని కటాక్షించుచు భగవానుని కీర్తించువాడు ఉండునని తెలిపిరి. ఇట్టి భాగవతుడు- అని తాత్పర్యము.

(యత్ర దేశే కదాచిదపి వర్తతే) - ఏ దేశమున ఎపుడైనను వసించినచో-

(తత్) - ఆ భాగవతాధిష్ఠితమైన దేశము.

(అక్షతతపోవనమ్) - ఆ భాగవతునిచే అధిష్ఠింపబడిన ఆ దేశమున తపస్సును చేసిన క్షతి కలుగదని భావము.

(తవ చ స్థిరా రాజధానీ) - నీకు స్థిరముగా నుండుటకు తగిన నగరమును అదియే. "తవ చ" అను చకారమువలన "వాసస్థానం తదిహ కృతినాం భాతి వైకుంఠ కల్పమ్" అని భాగవతాధిష్ఠితమైన దేశము పరమైకాంతులకు వాసస్థానమగుటయే కాక, నీకును వాసస్థానమగును- అని స్ఫురించును. "వాపీకూపతటాకై శ్చ వృక్షషండై శ్చ మండితమ్, అప్రాకృతం సురై ర్వంద్య మయుతార్కసమప్రభమ్" అని అత్యద్భుత

రమణీయవాపీకూపతటాకాదులచే, విచిత్రవృక్షషండములచే అలంకరింపబడినదై, తేజోరాశియైయున్న శ్రీవైకుంఠమును భగవానుడు రాజధానిగా కల్గియున్నను అందు ఆదరమును కల్గియుండక ఒక భాగవతుడు ఎపుడైన ఒకప్పుడు వసించిన ఒక గుడిసెను మహారాజధానిగా కల్గియుండును. రాజునకు రాజధాని నిత్యవాసస్థానమై, మిగిలిన ప్రదేశములు అప్పుడప్పుడు ఆగంతుకములై యుండునట్లు, శ్రీవైకుంఠాదులు ఆగంతుకదేశములుగా, భగవతాధిష్ఠితమైనప్రదేశము నిత్యావాసస్థానముగా నుండునని తాత్పర్యము. ఈ భావము "స్థిరా" అను పదముచే సూచితము. తొణ్డరడిప్పొడియాళ్వార్ మొదలగువారు ఒకానొక సమయమున నివసించిన దేశమగుటచే వారు వైకుంఠమునకు చేరి పిమ్మటను శ్రీరంగమున స్థిరముగా నిలచియున్నాడనుటను తలచి "తవ చ రాజధానీ" అని పల్కిరి.

(సుఖస్య సుఖ మాస్పదమ్) - మోక్షసుఖమునకును సుఖమైన స్థానము కూడ ఆ భాగవతాధిష్ఠితమైన దేశమే- అని భావము. లేక, మోక్షసుఖముకంటె ఎక్కువ సుఖముగా నుండుననియు చెప్పవచ్చును.

(సుచరితస్య దుర్గం మహత్) - భగవత్కైంకర్యమగు సచ్చరిత్రమునకు దృఢప్రాకారమును అదియే. భాగవతాధిష్ఠితమైన దేశమున కైంకర్యమును చేయ దొడగినచో, అందులకు విరోధులగు రజస్తమస్సులు, తత్కార్యములగు రాగద్వేషములు మొదలగు విరోధులును కలుగకుండుటనట్లు దృఢప్రాకారమై యుండునని తాత్పర్యము. ఇట్లు మాకు- పూర్వులకును భేదము లేక అందఱకును సుకరమైన శ్రీరంగాది దివ్యక్షేత్రములు ఇపుడు యవనాక్రాంతములైయుండగా, ఆ బాధను నివర్తింపచేయరాదా! అని ప్రార్థించుచున్నారని ఇచటి హార్దభావము. "రంగభూరసిక" అనుటచే నర్తనశాలయందుకల స్త్రీ విషయమున రాసిక్యమును కలవాడు, "యత్ర దేశే వశీ" అనుటచే జితేంద్రియుడు ఉండు చోటును రాజధానిగా అభిలషించియున్నాడను అర్థవిశేషము స్ఫురించుచున్నది.

అవ :- త్రివర్గమును అభిలషించువారికిని, కైవల్యార్థులకును త్వదనుభవవిరోధి నివృత్తిని కోరువారికిని, ఉపాయమును అనుష్ఠించునపుడు, ఫలమును అనుభవించు నపుడును ఏర్పడు స్ఖాలిత్యములకు భయపడువారి భయమంతయు పోవునట్లు, నడచువానికి స్ఖలనము కల్గునపుడు సమర్థుడు చేయూత నిచ్చి, రక్షించునట్లు నీ గుణములు చేయూత నిచ్చి రక్షణమున దీక్షను కల్గియుండు విధములన్నియు

శ్రీరంగమున ప్రత్యక్షసిద్ధము. ఇట్లుండ నేను విరోధులచే ఆక్రమింపబడినవాడనై యుండతగునా ? వానిని నివర్తింపచేయరాదా ! అను అభిప్రాయముతో దేశికులు ఈ క్రింది శ్లోకమును పల్కుచున్నారు.

త్రివర్గపథవర్తినాం త్రిగుణలంఘనోద్యోగినాం
ద్విషత్ప్రమథనార్థినా మపి చ రంగదృశ్యోదయాః ।
స్ఖలత్సమయకాతరీహరణజాగరూకాః ప్రభో
కరగ్రహణదీక్షితాః క ఇహ తే న దివ్యా గుణాః ॥ 9 ॥

ప్రభో= ప్రభూ !, రంగదృశ్యోదయాః = శ్రీరంగమున చూడతగిన ఉత్పత్తిని కల్గినది, త్రివర్గపథవర్తినాం = ధర్మార్థకామమోక్షములనెడి పురుషార్థములందు ప్రవర్తించువారికిని, త్రిగుణ = ప్రకృతిని, లంఘన+ ఉద్యోగినాం = దాటుటలో ప్రయత్నమును చేయువారికిని (కైవల్యనిష్ఠులకును- అని అర్థము), ద్విషత్ ప్రమథన+అర్థినాం + అపి = శత్రువులవంటి భగవదనుభవ విరోధుల నాశనమును కోఱువారికిని భగవానుని అనుభవమును అపేక్షించువారికిని, స్ఖలత్ సమయకాతరీహరణజాగరూకాః = ఆటంకములు కలుగునపుడు ఉన్నట్టి భయమును పోగొట్టుటలో జాగరూకులై యుండునవి యగు, తే = నీయొక్క, కే దివ్యా గుణాః = ఏ దివ్యగుణములు, కరగ్రహణదీక్షితాః న = చేయిని గ్రహించుటలో దీక్షను కల్గినవి కావు ?

ధర్మార్థకామమోక్షములనెడి ఐహికపురుషార్థములందు అపేక్షను కల్గినవారికి, కైవల్యమునందు ఆశను కలవారికి, సర్వవిధములైన కర్మలు నశించి నీ అనుభవమును పొందవలెనని ఆశపడువారికిని ఆటంకములు కల్గు సమయమున ఏర్పడు భయమును పోగొట్టునట్లు చేసి, చేయూత నిచ్చి రక్షించునవి నీ కల్యాణగుణములే- అని తాత్పర్యము.

(విభో) - సౌలభ్యాదిగుణములకు అనుగుణమైన ప్రభుత్వము, ప్రభుత్వానుగుణమైన సౌలభ్యాదిగుణములును కల్గిన నీవు సార్వభౌముడవై యుండగా, రాజు అసహాయశూరుడై, సార్వభౌముడై యుండ కుమారుడు శత్రుపీడితుడై, నిరాహారుడై యున్నట్లు, నేను విషయములనెడి విరోధులచే ఆక్రమింపబడినవాడనై, నీ అనుభవమును కోల్పోయియుండతగునా ? అను హార్దభావముతో ఇట్టి సంబోధనను కవిచేసిరి.

(రంగదృశ్యోదయాః) -శ్రీరంగమున చూడతగిన ఆవిర్భావమును కల్గిన వగు- అని అర్థము. ఇది గుణములకు విశేషణము. "దత్త మస్యాభయం మయా" అని సముద్రతీరమున విభీషణునకు అభయప్రదానమును చేసి, రావణాదులను నిరసించి,

లంకారాజ్యమును అను(గహించియు, మఱియు, అతనికి, అతని రాజ్యమునకు ఎట్టి ఆపద కల్గునో? అను అతిశంకతో "తెన్‌తిశై యిలజ్జై నోక్కి" అనునట్లు లంకను కటాక్షించుచు ఆ(శితరక్షణమున జాగరూకతకు కల్గిన గుణములను (ప్రత్యక్షముగా దర్శింపతగినట్లు శయనించియున్నావు కదా ! అని తాత్పర్యము.

((త్రివర్గపథవర్తినామ్) - "(త్రివర్గస్య పంథాః (త్రివర్గపథః, తస్మిన్ వర్తంతే ఇతి తథా, తేషామ్" అని వి(గహము. ధర్మార్థకామములనెడి (త్రివర్గములను నీనుండి పొందవలయునని తలచి, అందులకై ఉపాయానుష్ఠానము చేయువారలకును -

((త్రిగుణలంఘనోద్యోగినామ్) - (ప్రకృతినిర్మోకముచే కైవల్యమును పొందగోరు వారలకును

(ద్విషత్ (ప్రమథనార్థినామ్) - సర్వనిరోధికర్మనివృత్తిపూర్వకముగా, నీ అనుభవమును అర్థించువారికిని- అని భావము. ఉపాయానుష్ఠానకాలముననను, ఫలానుభవకాలముననను కల్గు స్ఖాలిత్యములనుగూర్చి భయపడువారి భయ మంతయు పోవునట్లు చేయూత నిచ్చి, రక్షించు విషయమున జాగరూకములై యున్నవి అనుచు పిమ్మట తెలుపుచున్నారు.

(స్ఖలత్పమయకాతరీహరణజాగరూకాః) - ఆటంకములు కలుగునపుడు ఏర్పడు భయమును పోగొట్టి, రక్షించుచున్నవని భావము.

(తే కే దివ్యాగుణాః) - నీ ఏ దివ్యగుణములు,

(కర(గహణదీక్షితాః వ) - చేయూత నిచ్చి రక్షించుటలో సంకల్పమును కల్గినవి కావు ? మార్గమున పయనించువానికి కష్టము కల్గినపుడు సమర్థుడొకడు చేయూత నిచ్చి రక్షించునట్లు, (త్రివర్గపథమున వర్తించువారికి స్ఖలనము ఏర్పడినపుడు చేయూత నొసగి రక్షించును. దేవతలు చిరకాలము జీవింపగోరినవారై, అప్సరసలతో (క్రీడింపవలయు నని తలచి అమృతమథనమును చేయ (ప్రారంభించి, అది సాధ్యపడక ఆ (ప్రయత్నమును విరమించినపుడు స్వామి చేయూత నిచ్చి రక్షించెనుకదా ! నదిని దాటువానికి స్ఖలనము (తొ(ట్రుపాటు) ఏర్పడినపుడు సమర్థుడొకడు చేయూత నిచ్చునట్లు, కైవల్యమును అర్థించువారై, సంసారతరణమును చేయువారికి చేయూత నిచ్చియు, సు(గీవుడు వాలితో యుద్ధమును చేసి, నిరుత్తరుడై నిలచినపుడు చేయూత నిచ్చి రక్షించినట్లు, విరోధులగు సర్వకర్మలయొక్క నివృత్తిని పొందవలెనని ఉపాయమును అనుష్ఠించునపుడు, ఆ

ఆచరణములో వశీకార్యపరంపరలో తెలుపబడిన విషయములను జయింపలేక తడబడు వానికి "తస్య చ వశీకరణం తచ్ఛరణాగతి రేవ" అని అతడు చేసిన ప్రపత్తికి వశుడై, అనుగ్రహించి, విరోధులను జయించునట్లు హస్తావలంబమును నొసగుచు, రక్షణమున కృతసంకల్పములైయున్నవి నీ గుణములు- అని భావము. వీరత్వముండి సౌలభ్యము రక్షణోన్ముఖమై లేకున్నను, సౌలభ్యము కల్గి వీరత్వము రక్షణోన్ముఖమైలేకున్నను, ఈ రెండును ఉండి దయ రక్షణోన్ముఖమై లేకున్నను, ఇట్లు అనేకగుణములుండియు ఒకగుణము రక్షణోన్ముఖమై లేకున్నను ఆశ్రితరక్షణము సంభవింపదు. కావున అన్ని గుణములును అహమహమికయా ఆశ్రితరక్షణమున దీక్షను కల్గియున్నవి అని భావము. ఇట్లుండ విషయములు అను సముద్రమున చిక్కి, తీరమును చేరలేక తడబడు నాకు చేయూత నిచ్చి రక్షింపలేదుకదా! అని పల్కుచున్నారని సారాంశము.

అవ:- అపరాధిరక్షణమున గుణము లన్నిటిలో దయాగుణము ప్రధాన మగుటచే దాని వైభవమును ప్రత్యేకముగా ఇందు వర్ణించుచున్నారు. ఒక ప్రబలమైన వ్యాధిచే పీడింపబడువాడు శీఘ్రముగా సర్వవ్యాధులను నివారించునది, సుఖమును కల్గించునదియు అగు ఔషధమును సేవింపకపోవుటయే కాక, మహావిషమును త్రాగి, పిమ్మట అపథ్యమును చేయునట్లు, సంసారవ్యాధిగ్రస్తుడగు పురుషుడు నిశ్శేషముగా సంసారవ్యాధినివర్తకము, సుఖావహమును అగు "ధ్యాయీత, ఉపాసీత, భజస్వ" ఇత్యాది నీ ఉపదేశరూపమగు మోక్షశాస్త్రార్థమును అనుష్ఠించుటలో అత్యల్పమైన కాయక్లేశములు కల్గుటచే, విషయములలోని అతిశయించిన అభినివేశముచే అట్టి మోక్షశాస్త్రశ్రవణమునకు కూడ భయపడి "శ్రుతిపథవిపరీతం క్ష్వేళకల్పమ్" అనునట్లు మధులవమిశ్రమైన మహావిషమువంటి వేదబాహ్యక్షుద్ర దేవతాంతరోపాసనవలన కల్గు అత్యల్పములైన ధనాదివిషయములలో ఆశను కల్గియుండుటయు, మఱియు తదీయోపలాలనమును చేయుటయు మొదలగు అపథ్యములను చేయుచున్నాడు. ఇట్టివానినికూడ రక్షింప తగిన సమయము కొఱకు వేచియుండి, రక్షించు నీ దయ, త్వదేకశరణుడనగు నన్ను రక్షింపలేదు కదా ! అనుచు ప్రస్తుతశ్లోకమున కవి హార్దముగా పల్కుచున్నారు.

బిభేతి భవభృత్ ప్రభో త్వదుపదేశతీవ్రౌషధాత్
కదధ్వరసదుర్విషే బడిశభక్షవత్ ప్రీయతే ।
అపథ్యపరిహారధీవిముఖ మిత్థ మాకస్మికీ
త మప్యవసరే క్రమాత్ దవతి వత్సలా త్వద్దయా ॥ 10 ॥

ప్రభో = ప్రభూ, భవభృత్ = (ఒక) సంసారి, త్వత్+ఉపదేశ = నీ ఉపదేశమను, తీవ్ర+ఔషధాత్ = ఉగ్రమగు మందువలన, బిభేతి = భయమును పొందుచున్నాడు, కదధ్వ =కుమార్గమునందున్న, రస = రసమను, దుర్విషే = దుష్టవిషయమున, బడిశభక్షవత్= (చేప) గాలములోని ముల్లును భక్షించునట్లు, ప్రీయతే = సంతోషించు చున్నాడు, ఇత్థం = ఇట్లు, అపథ్యపరిహార = అపథ్యమును పరిహరించుటలోని, ధీవిముఖం =బుద్ధియందును విముఖుడగు, తమ్+అపి = ఆ పురుషునికూడ, అవసరే = ఒక సమయవిశేషమున, క్రమాత్ = క్రమముగా, వత్సలా = దోషమును గమనింపని (భోగ్యముగా తలచు), త్వద్దయా = నీ దయాగుణము, ఆకస్మికీ = నిర్హేతుకమైనదై, అవతి = రక్షించుచున్నది.

సంసారియగువాడు నీ ఉపదేశమను ఔషధమునకు భయపడి, చేప గాలములోని కొక్కెమును మాంసముగా భ్రమించి భక్షించునట్లు, కుమార్గములోని రసము అను తీవ్రమైన విషమునందు అభిరుచిని కల్గియున్నాడు. అపథ్యమును చేయుటయు మానడు. ఇట్టి మానవుని విషయమునకూడ అకారణముగా జనించు, వాత్సల్యమును కల్గినదగు నీ దయాగుణము అతనికి జాయమానకటాక్షము మొదలగువానిని అనుగ్రహించును- అని భావము.

(ప్రభో)- ప్రాభవమును లేని పురుషుని దయ ఇతరులకు అనుపయుక్తమై తనకును అతిక్లేశకరమైయుండును. అట్లుకాక, దయతోకూడ ప్రాభవము కలసియుండుట తెలుపబడినది.

(భవభృత్) - సంసారమును మోయునట్టి పురుషుడు- అని భావము. ఇందువలన సంసారము జీవునకు కర్మముచే ఏర్పడినది, స్వాభావికమైనది కాదని ఏర్పడుచున్నది. ఇట్లు భారముగా వచ్చిన సంసారమును విషయములందలి భోగ్యతావశముచే నిరసింప మనస్సు లేనివాడై యుండును.

(త్వదుపదేశతీవ్రౌషధాత్) - తవ-నీ, ఉపదేశ = "భజస్వ, ధ్యాయీత" ఇత్యాది శాస్త్రోపదేశములు అను, తీవ్రౌషధాత్ = ఔషధమునకు తీవ్రత్వమనగా కటుత్వము, సద్యః అన్నివిధములైన వ్యాధులను నివర్తింపచేయుట మొదలగునవి, మఱియు సుఖావహత్వమును. అట్లే, భగవదుపదేశరూపమైన సచ్ఛాస్త్రము అర్థానుష్ఠానముద్వారా నిశ్శేషసంసారనివర్తకముగా, పిమ్మట సుఖావహముగా నుండుటచే దానిని తీవ్రౌషధ మనిరి.

(బిభేతి) - భయమును పొందుచున్నాడు. అర్థకామాదిభోగమున గల ఆదరముచే మోక్షశాస్త్రార్థానుష్ఠానములోని కాయక్లేశములవలన, కాఠిన్యమువలనను వేదాంతశ్రవణమునందుకూడ భయమును పొందుచున్నాడని తాత్పర్యము లేక, ఔషధతీవ్రత్వమనగా - ఎట్టి ఆలస్యము లేక వ్యాధిని నివారించుట. "సూర్యస్యైవ తు యో భక్త స్సప్తజన్మాంతరం నరః" అని క్రమముగా సంసారనివర్తకమగు భక్తిప్రపత్తులను విధించు "ధ్యాయీత, భజస్వ, ఉపాసీత, శరణం వ్రజ" ఇత్యాద్యుపదేశరూపములగు శాస్త్రమును వినుటలోకూడ సంసారములోని భోగ్యతాబుద్ధివలన దానికి ఆటంకము కల్గునేమో ? అను భయమును పొందుచున్నాడనియు చెప్పవచ్చును. అర్థకామములలో ఆదరమున్నచో ప్రభువగు నిన్ను ఆరాధించి వానిని పొందవచ్చును. ప్రభుత్వము లేని వేదబాహ్యులగు క్షుద్రదేవతలను "అజ్గోరాడుమ్ కళ్లుమ్ పిరాయ్" అనునట్లు బలి సురాకుంభాదులతో పూజించుట, తదుపయుక్త దుశ్శాస్త్రశ్రవణాదులను చేయుట, ఆ భోగమునందు మిక్కిలి ప్రీతిని కల్గియుండుటయు ఇచట వివక్షితములు. వానిని ఈక్రింది ప్రయోగములద్వారా కవి తెలుపుచున్నారు.

(కదధ్వరసదుర్విషే) - కదధ్వ = కుత్సితమార్గమువలనకల్గిన, రస = భోగరసము, అనగా క్షుద్రదేవతోపాసనారూప కుమార్గమువలన ఏర్పడిన భోగరస మని తాత్పర్యము. దుర్విషే = దుష్టవిషయ వాంఛతో నిన్ను పూజించి, అర్థకామములను పొందినచో ఆ కాలమున అది బంధహేతువైనను క్రమముగా ముక్తిపర్యంతమగును. శీఘ్రముగా ఫలమును పొందవలయునని దేవతాంతరములను పూజించినపుడు నీపట్ల అంతర్యామిత్వబుద్ధిని కల్గియుండి వారిని పూజించినచో సంసారహేతువైనను, పిమ్మట నరకప్రాప్తి కలుగదు. అట్లు కాక, క్షుద్రదేవతలయందు పరత్వబుద్ధితో ఆరాధించుటచే ఫలము తక్కువగుటయేకాక, పిమ్మట నరకప్రాప్తియు కల్గును. కావున ఇది శరీరనాశకర విషయమువలెకాక ఆత్మనాశకరమగుటచే "దుర్విషమ్" అని ప్రయోగింపబడినది. ఇట్టి దుర్విషమున, మత్స్యము భక్ష్యమునందలి ఆశచే పిమ్మట రాబోవు అనర్థమును గుర్తింపక గాలములను కొఱికి ఆనందించునట్లు, ఆసక్తిని కల్గియున్నాడని పిమ్మట తెలుపుచున్నారు.

(బడిశభక్ష్యవత్ ప్రీయతే) - "భక్ష్యోత్తమప్రతిచ్ఛన్నం మత్స్యో బడి శమాయసమ్, అన్నాభిలాషీ గ్రసతే న తు పాథ మపేక్షతే" అను ప్రమాణము ఇచట అభిప్రేతము. ఇట్లు క్షుద్రదేవతోపాసనాదులవలన సంపాదింపబడిన అర్థములతో పిమ్మట సంభవించు నరకప్రాప్తికి హేతువగు ఆయా క్షుద్రదేవతల పూజ, "కీళ్ మకనిట్టవాళవిన్ కీళ్" అనునట్లు

అతినీచమైన తదీయపురుష పూజయు- అను అపథ్యమును చేయుట -మానలేదు. అనుచు పిమ్మట పల్కుచున్నారు.

(అపథ్యపరిహారధీవిముఖమ్) - తదీయపర్యంతమైన, క్షుద్రదేవతారాధన రూపమైన అపథ్యమును పరిహరించు విషయమునందలి ఆశలో సైతము పరాఙ్ముఖుడైన- అని అర్థము. అకృత్యమును చేసినచో ఎపుడైన ఒక సమయమున బుద్ధియందైనను విచ్ఛేదము కలుగవచ్చును. అదియును లేదు- అని తాత్పర్యము.

(ఇత్థం త మపి) - ఇట్టి ఆ పురుషునికూడ

(ఆకస్మికీ) - అకస్మాత్తుగా కల్గిన సహజమైన- అని భావము. "క్షాంతి స్తవాస్మికీ" అని భట్టర్ ప్రయోగము. ఈకారణముచే ఏర్పడినదని తెలియుటకు సాధ్యము కాని- అని తాత్పర్యము.

(వత్సలా త్వద్దయా) - వాత్సల్యమును కల నీ కృప.

(అవసరే)- అవకాశము లభించినపుడు- అని అర్థము. ఆనుషంగిక-ప్రాసంగిక సుకృతలాభము కల్గినపుడు- అని తాత్పర్యము.

(క్రమాత్) - క్రమముగా.

(అవతి) - "శన్మ శన్మాన్తరమ్ కాత్తు" అనునట్లు అనేక జన్మలలో సుకృతమును ప్రతీక్షించి, రక్షించును- అని అర్థము. దయను, వాత్సల్యమును తెలుపుట చేతనసమాధితో. వత్సలయగు తల్లి దారి తప్పిన సంతానమును అవకాశముకొఱకు వేచియుండి రక్షించునట్లు దయ రక్షించునని భావము. ఇట్టి దయ అనన్యశరణుడను, విషయములచే, తురుష్కులచే ఆక్రమింపబడినవాడనగు నన్ను రక్షించుటలేదే ! అయ్యో- అని కవి వాపోవుచున్నారు.

అవ :- విరోధులను శిక్షించి, జ్ఞానులను, మిమ్ములను రక్షించుటకు ఆయుధములు మొదలగు సాధనములు కావలయును కదా !, అనినచో ఒక ఆయుధము మాత్రమే కాక పలు ఆయుధములను, గరుత్మంతుడు మొదలగు వాహనములను, సంపూర్ణముగా కల్గియున్నావుకదా! "శంఖాద్యసిగదాశార్ఙ్గ శ్రీవత్సాద్యుపలక్షితమ్, కౌశేయవాసపీ పీతే వసావం గరుడధ్వజమ్, దృష్ట్వా త మాత్మనా తుల్యం వేషం కృత్రిమ మాశ్రితః" అనునట్లు పౌండ్రకవాసుదేవుని కృత్రిమమైన శంఖచక్రాది ఆయుధములవలె

అపార్థములు కాదుకదా ! "రక్షోసురాణాం కఠినోగ్రకంఠచ్ఛేదక్షరత్క్షోణితదిగ్ధధారమ్" అని, "వైనతేయః స్వతః క్రుద్ధః పక్షవాతేన రాక్షసమ్, వ్యపోహత్ బలవాన్ వాయుః శుష్కపర్ణచయం యథా" అనియు ఆయుధములు, గరుత్మంతుడును శత్రుసైన్యములను నిరోధించువారుకదా ! "గతే రామే ప్రశాంతాత్మా రామో దాశరథి ర్ఘనః, వరుణాయాప్రమేయాయ దదౌ హస్తే ససాయకమ్" అని ఒక కాలవిశేషమున ఆయుధములను వరుణునివద్ద ఇచ్చినట్లు ఇపుడు ఆయుధములు పరహస్తగతములైనవా? ఏమి ? "పాతు ప్రణతరక్షాయాం విళంబ మసహ న్నివ, సదా పంచాయుధీం బిభ్రత్ స నః శ్రీరంగనాయకః" అని స్వయముగానేకదా ఆయుధములను ధరించియుంటివి ! "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" అనునట్లు ఇంద్రాదులందఱు నీవలన భయపడగా, నీకు భయ మేమి ? "న్యస్తదండా వయం రాజన్!" అని దండనాధికారమును లేని బ్రాహ్మణులవంటివాడవా నీవు ? పృథ్వీపతివికదా! "క్షత్రియైః ధార్యతే చాపో నార్తశబ్దో భవే దితి" అని క్షత్రియులు ఆయుధధారణమును చేయుట ఆర్తరక్షణార్థమని నీవే పల్కితివి కదా ! జ్ఞానిరక్షణమువలన నాకేమి ప్రయోజన మందువా ? దానివలన నీకు మాహాత్మ్యరూపప్రయోజనము లేదా ! జ్ఞానిని రక్షించుటవలన కలుగు మాహాత్మ్యము నాకు వలదు అందువా ! అట్లయినను నీదగు ఆత్మను రక్షింప నవసరములేదా ! జ్ఞానులు నీకు ఆత్మస్థానీయులు కదా ! "ఏష సర్వభూతాంతరాత్మా", "యఆత్మని తిష్ఠన్" ఇత్యాది ప్రమాణములు నిన్ను సర్వాంతరాత్మగా తెలుపుచున్నవి. జ్ఞానులు నాకు ఆత్మ అనుటకు ప్రమాణము కలదా! అన్నచో, "జ్ఞానీత్వైవాత్మైవ మే మతమ్" అని నీమాటే కలదుకదా ! నేను సర్వభూతాంతరాత్మను-అని వేదాంతసిద్ధాంత మైనను జ్ఞానులు నాకు ఆత్మ- అని నా సిద్ధాంతము అని "మే మతమ్" అనుచు నీవే పల్కితివి. నీవే సమ్మతించిన విషయమునకు ప్రమాణాపేక్షకలదా! అను అభిప్రాయముతో ఈక్రింది శ్లోకమును తెలుపుచున్నారు.

> అపార్థ ఇతి నిశ్చితః ప్రహరణాదియోగ స్తవ
> స్వయం వహసి నిర్భయ స్తదపి రంగపృథ్వీపతే ।
> స్వరక్షణ మివాభవత్ ప్రణతరక్షణం తావకం
> యదాత్థ పరమాత్మవి న్నియత మంతరాత్మేతి తే ॥ 11 ॥

రంగపృథ్వీపతే = శ్రీరంగనాథా, తవ = నీ, ప్రహరణాదియోగః = ఆయుధములు మొదలగువానిని కల్గియుండుట, అపార్థ ఇతి = వ్యర్థము అని, నిశ్చితః = నిశ్చయింపబడినది, తదపి = ఆ ఆయుధములు మొదలగునవియు, నిర్భయః =

భయమును లేనివాడవై, స్వయం = స్వయముగా (నీవే), వహసి = ధరించుచున్నావు, యత్ = ఏకారణమువలన, తావకం = నీకు సంబంధించిన, పరమాత్మవిత్ = పరమాత్మ జ్ఞానమును కలవాడు, తే = నీకు, నియతం = తప్పక, అంతరాత్మా+ఇతి = అంతరాత్మ అని, ఆత్థ = పల్కితివో, తత్ = అందువలన, ప్రణతరక్షణం = ఆశ్రితుల రక్షణము, స్వరక్షణమ్ ఇవ = నిన్ను (నీవు) రక్షించుకొన్నట్లు, అభవత్ = అయ్యెను.

శ్రీరంగనాథా ! నీవు చక్రము మొదలగు ఆయుధములను, గరుత్మంతుడు మొదలగు పరివారజనమును కూడియుండుట నీకొఱకు కాదు అని నిశ్చితము. అయినను, నీవు ఎట్టి భయమును లేనివాడవై ఆయుధములు మొదలగు వానిని ధరించియున్నావు. ఎందులకనగా - జ్ఞాని నీకు ఆత్మ అని నీవే తెలియజేసితివి. కావున ఆశ్రితరక్షణము నిన్ను నీవు రక్షించుకొనునట్లే అగునుకదా ! అందుచే అట్టి రక్షణకొఱకు నీవు ఆయుధాదులను దాల్చియున్నావు.

(రంగపృథ్వీపతే) - బ్రాహ్మణులవలెకాక నీవు ప్రభువు, కావున దుష్టనిగ్రహము నీకు ధర్మమైయున్నది కావున, ఆశ్రితవిరోధి నిరసనము చేయవలదా ! అని భావము.

(తవ) -నీయొక్క

(ప్రహరణాదియోగః) - ఆయుధవాహనాది ధారణము. ఆది శబ్దముచే వైనతేయాదులును లక్షింపబడుదురు. సాధనసంపత్తు సంపూర్ణముగా నుండగా, విరోధినిరసనము చేయరాదా ? అని భావము. గరుత్మంతుని ఆదిశబ్దముచే, చక్రాద్యాయుధములను స్వశబ్దముచే గ్రహించుట- "యం పశ్యన్ విశ్వధుర్యాం ధియ మసకృదధో మంథరాం మన్యమానో హుంకారాస్ఫాలనాంఘ్రిప్రహతివిహతిభిః తార్క్ష్య మధ్యక్షిప స్త్వమ్, కించోదంచ న్నుదస్థా స్త మథ గజపతేః బృంహితే జృంభమాణే దేవ శ్రీరంగబంధో ప్రణమతి హి జనే కాందిశీకీ దశా తే" అని పూర్వము గరుడుని వేగమును చూచి, సర్వజగన్నియమనధూర్వహమగు మనోగతినికూడ మందముగా తలచిన, నీవు గజేంద్రుడు ఆక్రోశించినపుడు గరుత్మంతుని వేగమును మందముగా భావించి అతనిని అధిక్షేపించుటచే, సుదర్శనుని ముందుగా ప్రయోగించుటచే, ఆయుధములకు ఆశ్రితవిరోధినిరసనత్వర అధికమని తెలుపుటకొఱకు.

(అపార్థ ఇతి నిశ్చితః) - నిరర్థక మని నిశ్చయింపబడినదో. పౌండ్రకుని ఆయుధమువలె వ్యర్థమా ఏమి? అని భావము. ఇచట ఈ భావము కాకువుచే ధ్వనించును.

పౌండ్రకుని ఆయుధములవలె వ్యర్థములు కాక, సార్థకములైన ఆయుధములను కల్గియుండగా, అట్టి ఆయుధములను లేనివానివలె రక్షింపకుండ నుండతగునా ? అని తాత్పర్యము. అయినను, మ్లేచ్ఛులు దుష్టులగుటచే నాకు భయము లేదా? ధనికుడైనను అభ్యర్థులు అడుగునపుడు ధనము హస్తగతముగా నుండవలసివచ్చినట్లు నీవు విరోధినిరసనమును కోరిన సమయమున తదుపయుక్తములగు ఆయుధములు నాచేతిలో ఉండవలయును కదా ?- అనినచో అందులకు సమాధానమును పిమ్మట తెలుపు చున్నారు.

(తదపి) - ఆ ఆయుధములుకూడ ఇచట "సామాన్యతో నపుంసకమ్" అను న్యాయమున నపుంసకలింగమున ప్రయోగింపబడినవి.

(నిర్భయః స్వయం వహసి) - భయరహితుడనైన నీవే దాల్చియున్నావు. ఆయుధములను ఎల్లప్పుడు స్వయముగా దాల్చి నిర్భయుడైయున్న ఆ కాలమున ఆయుధములు లేనట్లును, భయపడినవానివలెను విరోధినిరసనమును చేయకుండనుండ తగునా ? అని భావము. జ్ఞానిని రక్షించుటవలన నాకేమి ప్రయోజనము? అనినచో, అందులకు సమాధానము ఉత్తరార్ధమున తెలుపుచున్నారు.

(తావక ముద్దిశ్య పరమాత్మవిత్) - పరమాత్మజ్ఞానమును కలవాడు.

(యత్) - ఏకారణమువలన.

(తే నియతం) - నీకు నియతముగా- అనగా, యావదాత్మభావిగా- అని భావము.

(అంతరాత్మేతి ఆత్థ) -అంతర్యామి- అని అర్థము. "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" అని నీవే పల్కితివికదా ! "ఆత్మైవ" అను ఏవకారస్థానమున "నియతమ్" అని ఇచట ప్రయోగింపబడినది.

(తత్) - ఇది అవ్యయము. అందువలన- అని అర్థము.

(ప్రణతరక్షణమ్) - ఆశ్రితరక్షణము

(స్వరక్షణ మివాభవత్) - స్వరక్షణమే అయ్యెను. జ్ఞానులు నీకు ఆత్మ అగుటచే జ్ఞాని రక్షణము ఆత్మరక్షణముగా నయ్యెనని భావము. ఇచటి "ఇవ" శబ్దము "ఏవ"కారార్థకము. "ఏవ మివ పమంచితః ఔపనిషదపదసముదాయః ఇతి భాష్యస్థ ఇవశబ్దః

ఏవకారార్థకః" అని శ్రుతప్రకాశికలో తెలుపబడినది. కావున నీ చక్రాద్యాయుధములు పౌండ్రకుని ఆయుధములవలె వ్యర్థములుకాక సార్థక మగుటయు, అంతియేకాక, వ్యవహితములై యుండక సదాసన్నిహితములై యుండగా, నీవు నిర్భయుడవై, ప్రభువువైయుండగా, జ్ఞానులు నీకు ఆత్మసమానులైయుండగా, ఆయుధములు ఎల్లప్పుడు సమీపమున లేనివానివలె, భయమును కల్గినవానివలె, జ్ఞానులను రక్షించుటలో నీకు ఎట్టి ప్రయోజనమునివానివలె, ఉండతగునా ? అని అనుచున్నారని తాత్పర్యము. మఱియు, జ్ఞానుల రక్షణవలన కలుగు ఖ్యాతి మొదలగు వానియందు నీకు ఆదరము లేకున్నను, ఆత్మరక్షణము ఆవశ్యకము కదా! అనియు భావము. ఖ్యాతిమొదలగు వానియందు ఆశ లేదనుట. "స్వరక్షణ మివాభవత్" అని ఆత్మరక్షణము ఆవశ్యకమగుటచే అర్థాత్ సిద్ధము. "యథార్థపరమాత్మవిత్" అని పల్కుటచే స్వాభ్యుపగతార్థమున ప్రమాణాపేక్షలేదు అనియు భావము. "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" అనుచోట "మే" అను పదమును కాకాక్షిన్యాయముచే ఉభయత్ర అన్వయింపనగును. "జ్ఞానీ మే ఆత్మైవ మే మతమ్ అహం సర్వాత్మేతి ఉపనిషదాం మతమ్, మమ మతం తు జ్ఞానీ మమాత్మేతి - అని తాత్పర్యము.

అవ :- పూర్వశ్లోకమున "పరమాత్మవిత్" అని ప్రస్తుతమైన జ్ఞానియొక్క వైభవమును తెలిపిరి. త్వదనుభవైకతత్పరులగు జ్ఞానులు అత్యల్పసుఖప్రదమై, అతిప్రయాసతో స్వయముగానే సాధ్యసుకృతాదికర్మసంపాదితమై, మహాభయప్రదమైయున్న కళత్రపుత్ర సోదరులు మొదలగు చేతనులవలన, గృహక్షేత్రాది అచేతనములవలన సంతోషమును పొందరు. ఇట్లు వీనిలో దోషోద్భావనమును చేయుటకూడ అవి అపేక్షితములు కాదనుటకు హేతువు కాదు. స్వరూపకీర్తనము చేయుటలోనే దీనికి తాత్పర్యము. అవి అనపేక్షితము లగుటకు నీ అనుభవముకంటె అవి వేఱగుటయే కారణము. ఈ అర్థమును నేను తెలుపవలెనా? సర్వాంతర్యామి యగు నీవు గ్రహింపవలదా? ఇట్లు త్వదనుభవైకతత్పరు లగు జ్ఞానులకుకల విరోధులను నివర్తింపచేయరాదా? అను అభిప్రాయముతో అనంతర శ్లోకమును దేశికులు అనుగ్రహించుచున్నారు.

లఘిష్ఠసుఖసంగదైః స్వకృతకర్మనిర్వర్తితైః
కళత్రసుతసోదరానుచరబంధుసంబంధిభిః ।
ధనప్రభృతికై రపి ప్రచురభీతిభేదోత్తరైః
న బిభ్రతి ధృతిం విభో త్వదనుభూతిభోగార్థినః ॥ 12 ॥

విభో = ప్రభూ !, లఘిష్ఠ = మిక్కిలి అల్పమైన, సుఖ = సుఖములయొక్క, సంగదైః = సంబంధమును కల్గించునవి, స్వకృత = తమచే చేయబడిన, కర్మనిర్వర్తితైః = కర్మలచే సంపాదింపబడినవి అగు, ప్రచురభీతిభేద+ఉత్తరైః = అధికమైన భయవిశేషమును కల్గించువారిలో గొప్పవారగు, కళత్ర = భార్య, సుత = కుమారుడు, సోదర = తోబుట్టువు, అనుచర = (పరివారము) సేవకులు, బంధు = బంధువులు, సంబంధిభిః = సంబంధమును కలవారు అను వీరిచే, ధనప్రభృతి కైః+ అపి = ధనము మొదలగువానిచే, త్వత్ + అనుభూతి = నీ అనుభవము అను, భోగ+అర్థినః = సుఖమును కోరువారు, ధృతిం= సంతోషమును, న బిభ్రతి = పొందరు.

ప్రభూ ! నీ అనుభవమున ఆశను కలవారు మిక్కిలి అల్పమగు సుఖమును కల్గించువారు, తమచే పూర్వజన్మమునందు చేయబడిన కర్మలకు ఫలముగా ఏర్పడినవారు అగు కుమారుడు, భార్య మొదలగువారిచే, ధనము మొదలగువానిచే సంతోషమును పొందరు.

(లఘిష్ఠసుఖసంగదైః) - అత్యల్పసుఖప్రదములగు,

(సుకృతకర్మనిర్వర్తితాః) - తనచే చేయబడిన యాగాదికర్మలవలన సంపాదింపబడిన- అని అర్థము. ఫలము అల్పముగా నుండుటయేకాక, అశక్తుడగు శిష్యునకు ఫలమును ఇచ్చునట్టి ఆచార్యాదులు చేసిన ప్రపత్తివలె కాక, అతిప్రయాసతో తనచే తనే సాధ్యమైన కర్మచే సంపాదింపబడతగినదై యున్నదని ప్రస్తుతఘట్టార్థము.

(ప్రచురభీతిభేదోత్తరైః) - ఏ పదార్థములవలన పురుషునకు పరస్పరము విలక్షణములగు భయములు ప్రచురములై ఏర్పడునో, ఆ పదార్థములని భావము. అవి ఏవనగా సర్పవ్యాఘ్రాదులు. వానిలో ఉత్తరములనగా గొప్పవి. అతిభయంకరములగు సర్పములకంటె కళత్రాదులు అతిభయంకరములుగా నున్నవని తాత్పర్యము. లేక, "ప్రచుర శ్చాసౌ భీతిభేద శ్చ ప్రచురభీతిభేదః, సః ఉత్తరస్మిన్ కాలే యేభ్య స్తే" అని విగ్రహము. పురుషునకు అనుభవవేళలో సుఖాభావములై తోచినను, పిమ్మట కళత్రాదినిమిత్తముగా మధురమైన భోగములను అనుభవించినవారే ఆ అనుభవమును పొందుటకు తగిన యోగ్యత పోగానే ఆ స్త్రీలచేతనే మిక్కిలి పరిభవింపబడుదురని "కొణ్డపెణ్డీర్" అను దశకమున నమ్మాళ్వార్లు (తిరువాయ్‌మొళి దివ్యప్రబంధమున) విశదీకరించిరి. అట్లే ధనాదులును. "ఐశ్వర్యం శత్రుశాలితా బధిరయతి కర్ణకుహరం

వాచం మూకయతి నయవ మంధయతి, కంపయతి గాత్రయష్టిం సంపద్రోగోఽయ మద్భుత: పుంసామ్" అనునట్లు మహానర్థకారణ మగును.

(కళత్రసుతసోదరానుచరబంధుసంబంధిభి: ధనప్రభృతిక్తై రపి) - తనవారని భావింపబడిన కళత్రాది చేతనవర్గములచే, ధనాది అచేతనవర్గముచే.

(త్వదనుభూతిభోగార్థిన: ) - నీ అనుభవమునందే తత్పరులగు జ్ఞానులు.

(ధృతిం) - సంతోషమును

(విభో) - సర్వాంతర్యామియై, కావున విభువువైయున్న స్వామీ !

(న బిభ్రతి) - పొందరు.

ఈ అర్థమును విభువువై, సర్వాంతర్యామియైయున్న నీవు స్వయముగా తెలియవలదా ? నేను తెలియజేయవలెనా ? అని హార్దాభిప్రాయము. "త్వదనుభవ భోగార్థిన:" అనునది సాభిప్రాయకము. త్వదనుభవ తత్పరులగు జ్ఞానులకు నిన్ను అనుభవింపనీయక ఆటంకపఱచు తురుష్కులను నిరసింపవలదా? అని పల్కుచున్నారని తాత్పర్యము. మఱియు, నీ అనుభవమునందే ఆసక్తిని కలవారగు జ్ఞానులు దానికంటె వేఱైన ఇతరభోగములందు ఆశను కల్గియుండరనియు భావము.

**అవ** :- శరీరసంబంధమును కల్గిన కళత్రాదులు అనేకదోషదూషితులగుచే భయంకరములైనను, తన శరీరము తనకు భోగ్యముకదా ! అనినచో, అదియును మిక్కిలి భయంకరమే అని తరువాతి శ్లోకమున తెలుపుచున్నారు. నరకమునందు బాధింపబడు పాపులు అనుభవించు అతిదుస్సహములైన కుంభీపాక నరకయాతనాదులను చూచియు, "ఛింది, భింధి" (నఱకుము, బద్దలు కొట్టుము) అను యమభటుల మాటలను వినియు, ధీరుడగు ధర్మరాజునకును వ్యామోహము కల్గించునట్టి అతిభయంకరములైన నరకయాతనలను, "తిణ్ణ మళుద్దక్కట్టి పలశెయ్‌వన వన్‌కయిత్తాల్ పుణ్ణ మఱియ వరిన్దైన్ప్పోరవైత్తాయ్" అనునట్లు సిరాబద్ధుడై, ఉల్బసంవేష్టితుడై, భుగ్నపృష్ఠగ్రీవుడై, శకృన్మూత్ర శాయియై, ప్రాజాపత్యవాయువుచే తలక్రిందుగానుండి, ప్రసూతివాయుబలముచే యోనియంత్రపీడితుడై, మహాదు:ఖముతో అశుచిప్రదేశమునుండి వేఱొక మలమువలె బయటకు వచ్చునట్టి గర్భక్లేశమును తెలుపుటకు ఎవరికిని సాధ్యము కాదు. కఫవాత పిత్తాద్యనేకదోషదూషితమగు ఈ శరీరము జ్ఞానహీనులకు సుఖకరముగా తోచినను,

వివరణ చేసి చూచినచో నరక, గర్భవాసములవలె వాచామగోచరమైన యాతనను కల్గించునదియై యున్నది."య న్న దుఃఖేన సంభిన్నమ్" అనునట్లు దుఃఖాసంభిన్నమైన స్వర్గాదిసుఖమును ఆశ్రయించినచో ఏమి ? అనినచో రావణవృత్రాదులకు వశులై దుఃఖపడిన ఇంద్రాదులు పొందిన, చందనకాష్ఠముతో సమానమైన లోకపాలాదిపదము, రావణాదులకు వరము నిచ్చి, ఉజ్జీవింపవచ్చిన బ్రహ్మయు మధుకైటభులను చూచి భయాక్రాంతుడై తనకు ధనము, కన్నులును అగు వేదములను పోగొట్టుకొని, జలదేశ మేదియో, స్థలదేశ మేదియో తెలియనివాడై విలపించునట్లు పొందిన పదమును నిరూపింపగా, వాచామగోచరయాతనాస్పదమై యుండును. ఇట్లు చతుర్ముఖాంతమైన ఐశ్వర్యముకూడ బహుదోషదూషితమగుటచే భయాస్పదమైయున్నను, ప్రచురసుఖ రూపమైన ఆత్మానుభవరూపకైవల్యమును ఆశ్రయించిన ఏమి ? అన్నచో, పలు మాటలు చెప్పి ఏమి ఫలము?- "అప్రాకృతం సురై ర్వంద్య మయుతార్కసమప్రభమ్", "జ్ఞానానందమయా లోకాః", "నిత్యసిద్ధై స్సమాకీర్ణమ్", "న చ పునరావర్తతే" ఇత్యాది ప్రమాణములవలన అత్యుజ్జ్వలమై, జ్ఞానానందస్వరూపమై, అపునరావృత్తిహేతువైన నీ స్థానముముందు "సర్వే చ్యవనధర్మాణః" అనునట్లు పునరావృత్తిహేతువులై, ఆదిత్యుని ముందు ఖద్యోతమువలె మిగిలిన స్థానములుండుటచే అభయాస్పదమైన స్థానమేదియు లేదు. కైవల్యమునకు భగవదనుభవాపేక్షయా ఆనందము అల్పతరమై యుండుటతోపాటు పునరావృత్తియు కల్గుటచే అదియు భయాస్పదమను అభిప్రాయముతో దేశికులు ప్రస్తుతశ్లోకమును అనుగ్రహించుచున్నారు.

న వక్తు మపి శక్యతే నరకగర్భవాసాదికం
వపు శ్చ బహుధాతుకం నిపుణచింతనే తాదృశమ్ ।
త్రివిష్టపముఖం తథా తవ పదస్య దేదీప్యతః
కి మత్ర న భయాస్పదం భవతి రంగపృథ్వీపతే ॥ 13 ॥

రంగపృథ్వీపతే = శ్రీరంగనాథా !, నరకగర్భవాసాదికం = నరకము, గర్భవాసము అను మొదలగునవి (వీనిలోనున్న దుఃఖములని భావము), వక్తుమ్ అపి = చెప్పుటకు కూడ, న శక్యతే = శక్యముకాదు, బహుధాతుకమ్ = అనేకధాతువులను కల, వపుః+చ = శరీరమును, నిపుణచింతనే = నిపుణముగా (నిశితముగా) ఆలోచింపగా, తాదృశమ్ = అట్టిది, త్రివిష్టపముఖం = స్వర్గము మొదలగు స్థానములు, తథా = అట్టివే, దేదీప్యతః = మిక్కిలిప్రకాశించు, తవ = నీ, పదస్య = స్థానమునకు ముందు, అత్ర = ఈ ప్రకృతి మండలములో, కిమ్ = ఏది, న భయ+ ఆస్పదమ్ = భయమునకు స్థానము కాదు?

శ్రీరంగనాథా ! నరకానుభవము ఏ విధముగా దుఃఖములను కల్గినదో, అట్లే గర్భవాసముమొదలగు వానియందుగల దుఃఖపరంపరలు మిక్కిలి జుగుప్సితములగుటచే వానినిగూర్చి చెప్పుటకుకూడ శక్యము కాదు. ఇక అనుభవించుటకు సాధ్యము కాదనుట చెప్పవలెనా ? అట్లే, శరీరమును బాగుగా పరిశీలించినవారికి శవమని చెప్పతగినదియై, అనేకదుఃఖమయమై, మిక్కిలి హేయమైయుండుటచే మిక్కిలి దుఃఖమును కల్గించుటలో గర్భవాసము మొదలగు వానితో అది సమానమే. అనేకదుఃఖములనెడి చీకటితో కూడిన ఈ శరీరమువలన కల్గు సుఖములును మెఱపుతీగవలె మెఱసి అంతరించునే తప్ప నిలుకడగా నిలువవు. స్వర్గము మొదలగు పదములును ఇట్లే అనేకదోషములను కల్గినవి. కావున మిక్కిలి వెల్గుచున్న నీస్థానమునకు ముందు ఈ ప్రకృతి మండలములో నున్న ఏస్థానము భయమునకు స్థానము కాదు ? అన్ని పదములును భయమునకు ఆస్పదములేయగుటచే నీ స్థానమును పొందునట్లు దాసుడనగు నాకు ఏ విధమైన భయము లేకుండునట్లు కృప జేయవలయునని తాత్పర్యము.

(నరకగర్భవాసాదికమ్) - నరకగర్భవాసాదులచే కలుగు క్లేశము.

(న వక్తు మపి శక్యతే) - చెప్పుటకుకూడ సాధ్యము కాదు. అనుభవించుటకు అశక్య మగుటయే కాక, చెప్పుటకుకూడ సాధ్యముకాదనుట "అపి" శబ్దముయొక్క భావము. వాచామగోచరమని తాత్పర్యము. ముక్తునకు ముక్తానుభవము వాచామగోచరమై యుండునట్లే, బద్ధునకు నరకానుభవమును వాచామగోచరమైయుండును. ఇది దృష్టాంతార్థము. యాతనాశరీరమువలె వర్తమానశరీరమును అతిక్లేశావహ మనుచున్నారు.

(బహుధాతుకం వపు శ్చ) - అనేక కఫ-వాత పిత్తాది ధాతువులను కల్గిన వర్తమానశరీరమును.

(నిపుణచింతనే తాదృశమ్) - నిరూపించినపుడు వాచామగోచర క్లేశావహమే. అనిపుణులకు సుఖమై తోచినను, నిపుణులకు క్లేశావహమై యుండును. "నిపుణానాం చింతనం నిపుణచింతనమ్, తస్మిన్", లేక, "నిపుణం చ తత్ చింతనం చ నిపుణ చింతనమ్, తస్మిన్" అని కాని విగ్రహము. ఈ శరీరక్లేశమునకు ఒక వాచకపదమున్నదా!- అని బాగుగా విచారించినచో, వాచామగోచరమను పలుకు తప్ప వేఱొక పదము లేదని భావము. ఇందుచే వర్తమానశరీరసాధ్యదృష్ట పురుషార్థమును దూషించినట్లయినది. ఇట్లయినను "య న్న దుఃఖేన సంభిన్నమ్" అని చెప్పునట్టి దుఃఖా సంభిన్నస్వర్గానుభవమును ఆశ్రయించినచో ఏమి? అనినచో- అందులకు సమాధానమును పిమ్మట తెలుపుచున్నారు.

(త్రివిష్టప) స్వర్గాదియై చతుర్ముఖాంతమైన దేవతల స్థానమును, కైవల్యమును- అని భావము.

(తథా) - మహాక్లేశావహము. "దేదీప్యత:" అను పదస్వారస్యమునుబట్టి ముఖశబ్దముచే కైవల్యమును వివక్షిత మని గ్రహింపనగును. చతుర్ముఖానందముకంటె మహానందముండుటచే కైవల్యపదము దీప్యమానము. నిరతిశయానందహేతువగు పరమపదము దేదీప్యమానము. ఆళ్వార్లును "తెరివరియ వళ విల్లా చ్చిత్తిన్పమ్" అని కైవల్యమునుగూర్చి పల్కిరి. చతుర్ముఖాద్యానందముకంటె విపుల మగుటచే అంతులేని దనియు, భగవదానందాపేక్షయా అత్యల్ప మగుటచే అల్పానందమనియు ఆళ్వార్లు పల్కిరి.

(దేదీప్యత: తవ పదస్య) - అత్యంతప్రకాశమగు నీ స్థానము ముందు.

(అత్ర కిం న భయాస్పదమ్) - ఈ ప్రకృతిమండలమునందు ఏ పదము భయాస్పదము అగుట లేదు? సర్వము భయాస్పదమే అగును.

(రంగపృథ్వీపతే) - తండ్రి సార్వభౌముడైయుండగా సంతానము ఉపవసించినట్లు (నిరాహారులైయున్నట్లు) నీవు పతివైయుండగా నేను నీ అనుభవమును కోల్పోయి, శబ్దాదివిషయములచే, తురుష్కయవనాదులచే ఆక్రాంతుడనై యుండతగునా? అని దేశికులు ప్రార్థించుచున్నారు.

అవ:- పూర్వోక్తార్థమును ప్రకారాంతరమున అనుసంధించుచు, తమపట్ల కృపచేయవలయునని కవి ఇందు ప్రార్థించుచున్నారు. అశుభములైన దేశకాలములు భగవదనుభవిరుద్ధములగుటచే అందు వసింప భయపడినవారైనచో శుభములైన దేశకాలములలో వసింపరాదా ? అనినచో, శుభమువలె ఆపాతప్రతీతిసిద్ధములైన దేశకాలాదులును మిక్కిలి భయాస్పదములై యున్నవి. కావున పాముకు భయపడి పులినోటిలో పడినట్లు ఒక దేశమునకు భయపడి వేఱొక దేశకాలములకు పోయినచో అచటను గొప్ప అనర్థము కల్గును- అని మహాభయమును పొందిన నా పట్ల నీవు దయ చూపకున్నచో, దయ చూపువారు వేఱొకరు కలదా ? లేక రక్షింపగలరా ? నేను నశించుచున్నాను. నీకృపకు నేను తప్ప ఉభయవిభూతులలో వేఱేమియు తగిన లక్ష్యము లేకుండుటచే నీదయ నిర్విషయమై పోవును సుమా- అని ఈ శ్లోకమున కవి పల్కుచున్నారు.

**భవంతి ముఖభేదతో భయనిదాన మేవ ప్రభో**
**శుభాశుభవికల్పితా: జగతి దేశకాలాదయ: ।**

ఇతి ప్రథితసాధ్వసే మయి దయిష్యసే త్వ న్న చేత్
క ఇత్థ మనుకంపితా త్వదనుకంపనీయ శ్చ యః ॥ 14 ॥

ప్రభో = ప్రభూ, జగతి = ఈ ప్రకృతిమండలమునందు, శుభ+అశుభవికల్పితాః = ఇది శుభమని, అది అశుభ మని వికల్పింపబడుచున్నవగు, దేశకాల+ఆదయః= దేశము, కాలము మొదలగునవి, భయనిదానమ్+ఏవ= భయమునకు కారణములే, భవంతి = అగుచున్నవి, ఇతి = అని, ప్రథిత సాధ్వసే = మిక్కిలి భయమును కల్గిన, మయి = నాయందు, త్వం =నీవు, న దయిష్యసే చేత్ = దయను చేయకపోయినచో, కః = (నీకంటె వేఱయిన) ఎవడు, ఇత్థం =ఇట్లు, అనుకంపితా = దయను చూపువాడు కలడు?, త్వదనుకంపనీయః + చ = నీచే దయచూపబడతగినవాడును, కః = (నాకంటె వేఱయిన వాడు) ఎవడు కలదు ?

ఈ ప్రకృతిలో శుభమని చెప్పబడు కృతయుగము, స్వర్గము, ఆర్యావర్తము మొదలగు దేశకాలములును, అశుభమని చెప్పబడు కలియుగము మొదలగు దేశకాలములును భయమునకు ఆదికారణముగా అగుచున్నవి. మిక్కిలి అధికమైన భయమును కల నాయందు నీవు దయ చూపకపోయినచో, నీకు దయనీయుడు ఎవడును ఉండడు, నీ దయ నిర్విషయమై పోవును, కావున నాయందు కృపచూపి, నన్ను రక్షింపనగును- అని తాత్పర్యము.

(ప్రభో) - "కః పౌరవే వసుమతీం శాసతి శాసితరి దుర్వినీతానామ్, కథ మాచరత్యవినయమ్" అనునట్లు ఆర్తులను రక్షించుటకు కారణమైన ప్రభుత్వము నాకు ఆర్తిని కల్గించుటకు కారణమైనది. నేను మీకు ఆర్తిని కల్గించుచున్నానా ? - అనినచో, ఆర్తిని తీర్చగల సమర్థుడవైయుండి ఆర్తిని తీర్పక ఉపేక్షించినపుడే ఆర్తిని కల్గించిన వాడవైతివి కాదా - అని తాత్పర్యము.

(భవతి శుభాశుభవికల్పితాః దేశకాలాదయః)- ఈ ప్రకృతిమండలమునందు ఇది శుభము - ఇది అశుభము అని విడదీయబడినవగు స్వర్గనరకములగు దేశములు, కృతకలియుగాది కాలములు, శత్రుమిత్రాదులు అన్నియు- అని అర్థము. ఆదిశబ్దముచే శత్రుమిత్రాదులును ఉపలక్షింపబడిరి.

(ముఖభేదతః) - ఆకారభేదముచే

(భయనిదావ మేవ) - "భవంతి" అని అధ్యాహరించుకొనవలెను. నరకమున

యమభటులచే భయము కలుగునట్లే, స్వర్గమునందును అసురులచే భయము కల్గుటయే కాక, "దేవానాం పశుః" అనునట్లు ఎద్దు పరదేశమునకు పోయిన విధముగా దేవతలకు వేఱొక చోటికి పోవలసివచ్చుటచే, "స్వర్గేఽపి పాతభీతస్య క్షయిష్ణోః నాస్తి నిర్వృతిః" అనునట్లు స్వర్గము మొదలగు చోట్లకూడ దుఃఖము కల్గును. కావున అవి భయాస్పదములే అగును. శుభములగు ఆర్యావర్తము మొదలగు దేశములును ఇవుడు యుగస్వభావముచే వ్యాకులములై యుండుటచే అశుభములైనవి. కృతయుగాదికాలములందును, సౌభరివిశ్వామిత్రాదులును విషయపరతంత్రులైరి. అర్థకామములవలన మిత్రులును శత్రువులగుచున్నారు. కావున ఒక్కొక్క దేశ-కాల-వస్తువును ముఖభేదముచే భయనిదానమే అగుచున్నది.

(ఇతి ప్రథితసాధ్వసే మయి) - ఇట్టి హేతువులచే అభివృద్ధమైన భయమునుకల దాసుడు. సర్పముల నోటిలో పడిన విధమున విషయముల నోటిలో చిక్కుపడి భయాక్రాంతుడనై, దాగుకొనుచోటు ఏదైన కలదా ! అని చూడగా, సర్వదేశకాలములును సింహవ్యాఘ్రములవలె నుండుటచే భయము అభివృద్ధమై యున్నదని భావము.

(త్వం న దయిష్యసే చేత్) - సమర్థుడవు, ప్రాప్తిని (సంబంధమును) కలవాడవగు నీవు కృపను చేయకపోయినచో,

(క ఇత్థ మనుకంపితా) - ఇక ఎవరు "మా భైషీః" అని పల్కి దయ చూపుదురు? బ్రహ్మాదులైన రక్షింప సమర్థులా ? ప్రాప్తిని కలవారా ? అని భావము. పరమదయాళువు, సమర్థుడవు అగు నీవు చేయివిడచినచో వేఱెవ్వరు రక్షింతురు? నీవు సత్యప్రతిజ్ఞను కలవాడవగుటకై భరతుని విశ్లేషింపచేసి బాధించితివి. కాని, నన్ను విశ్లేషింపజేయుటలో ఏ ప్రయోజనము కలదు? నేను అనుభవించు దుఃఖముచే నీకు ప్రయోజనమున్నచో నాకు ఇదియే తగును- అని భావము.

(త్వదనుకంపనీయ శ్చ కః)- నీవు కృప చేయుటకు నేను తప్ప వేఱెవ్వరును లేరు. పుణ్యోత్తరులగు వ్యాసపరాశరాదులును తమ (ఉపాయ) బాహుబలముచే తరించిరి. వారియందు నీ దయకు అవకాశము లేదు. మహాపాపినై, జ్ఞానానుష్ఠానాదులలో ఏమియు లేక భయాక్రాంతుడనై, సంసారమున విషయాక్రాంతుడనై తడబడుచు సంచరించు నాయందుకదా నీ కృపను ఉపయోగింపవలెను. నీ కృపకు నిర్విషయత్వము రాకుండుట కైనను నన్ను రక్షింపవలదా- అని కవి హృదయము.

అవ :- మిమ్ములను రక్షింపవలెనన్న "ధ్యాయీత, ఉపాసీత" అని వేదాంతములందు విధింపబడిన ఉపాసనను అనుష్ఠింపరా ? - అనిన, భక్తియోగానుష్ఠానమునకు జ్ఞానశక్తులను లేక కృపణులై, సకృత్ప్రపత్తిని చేసినవారికిని, సత్సంబంధమును పొందిన వారికిని అభయప్రదానమును చేయుట నీ వ్రత మని, ఇది అసత్యము కాదని వేదములు, ఋషులును చెప్పుటయేకాక, "ఏతత్ వ్రతం మమ" అని, "రామో ద్వి ర్నాభిభాషతే" అనియు నీవే స్వయముగా పల్కితివి. ఇది అనుష్ఠానపర్యంతమగుటను విభీషణాళ్వాన్ మొదలగువారు దర్శించిరి. ఇట్లు కృపణులను రక్షింతునని చెప్పిన మాటను కృపణసార్వభౌముడనగు నాయందు మాత్రము అసత్యము కావింతువా? అని మిక్కిలి బాధతో ప్రార్థించుట ఇందలి విషయము.

> సకృత్ప్రపదనస్పృశా మభయదాననిత్యవ్రతీ
> న చ ద్వి రభిభాషసే త్వ మితి విశ్రుత స్స్వోక్తిత: ।
> యథోక్తకరణం విదు స్తవ తు యాతుధానాదయ:
> కథం వితథ మస్తు తత్ కృపణసార్వభౌమే మయి ॥ 15 ॥

త్వం = నీవు, సకృత్ = ఒకమాఱు, ప్రపదనస్పృశామ్ = ప్రపత్తిని ఆచరించినవారికి, అభయదాన = అభయమును ఇచ్చుటలో, నిత్యవ్రతీ = నిత్యమైన వ్రతమును కల్గినవాడవని, న చ ద్వి రభిభాషసే ఇతి = రెండవ మాటను పలుకవు అని, స్వ+ఉక్తిత: = నీమాటవలననే, విశ్రుత: = ప్రసిద్ధుడనైతివి, యాతుధానాదయ: = విభీషణుడు మొదలగువారు, తవ = నీయొక్క, యథా+ఉక్త: = చెప్పిన (ప్రతిజ్ఞచేసిన) పద్ధతిలోనే, కరణం = చేయుటను, విదు: = తెలిసిరి, కృపణసార్వభౌమే = అకించనులలో చక్రవర్తియగు, మయి = నాయందు, తత్ = ఆ వ్రతము, కథం = ఎట్లు, వితథమ్ అస్తు = వ్యర్థ మగును ?

ఒక పర్యాయము ప్రపత్తిని చేసినవారికిని, వానికి సంబంధించినవారికిని అభయప్రదానమును చేసి రక్షింతువని, రెండవ మాటను పలుకవనియు నీవే నోరు తెఱచి పల్కిన "ప్రపన్నులను అభయప్రదానము చేసి రక్షింతును" అను నీ వ్రతమును దానిని నీవు అనుష్ఠించిన విధమును విభీషణుడు మొదలగువారు సాక్షాత్తు తెలిసికొనిరి. ఇట్లుండగా, మిక్కిలి అకించనుడనగు నాయందు మాత్రము ఆ ప్రతిజ్ఞ వ్యర్థము కాదగునా? అని భావము.

(సకృత్ ప్రపదనస్పృశామ్) - "సకృత్ ప్రపదనం స్పృశంతీతి సకృత్ప్రపదన స్పృశ:, తేషామ్" అని విగ్రహము. ప్రపత్తిని ఒక మారు అనుష్ఠించినవారికి. "స్పృశామ్"

అని చెప్పుటచే సాంగోపాంగమైన సంపూర్ణానుష్ఠానమునకు శక్తి లేనపుడు "యేవ కేవాపి ద్వయవక్త్రారమ్" అనునట్లు సముదాయజ్ఞానముతో మాత్రము అనుష్ఠించినను చాలునని తాత్పర్యము లేక, "సకృత్ ప్రపదనం యేషాం తే, తాన్ స్పృశంతీతి సకృత్ ప్రపదనస్పృశ: , తేషామ్" అను వివరణమువలన, సకృత్ ప్రపదనమును చేసినవారి సంబంధమును పొందినవారికి- అని ధ్వనించును. ప్రపన్నసంబంధులను రక్షించునని పల్కుటచే ప్రపన్నరక్షణము కైముత్యన్యాయసిద్ధము. "కేశవన్ తమర్కీళ్ మేలెళుపిఅప్పుమ్ మాశదిర్పెత్తు" అను పాశురమునకు ఏవిధముగానైన సాక్షాత్తుగా కాని, పరంపరగా కాని, నాతోడు సంబంధమును పొందినవారు అందఱు భగవదేకభోగమును కల్గినవారైరి- అని పిళ్లాన్ వ్యాఖ్యానమును చేసిరి. ఒక పర్వతమునుండి వేఱొక పర్వతమునకు దుముకు సింహశరీరమునందలి ప్రాణివలె భాష్యకారులు సంసారాతిలంఘనమును చేయగా వారితోకల సంబంధముచే మనమును ఉత్తీర్ణుల మగుదుము- అని ముదలియాణ్డాన్ (దాశరథిగురువు) సూక్తి. ఈ అర్థమును "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే" అను శ్లోకమున గమనింపనగును. "తవాస్మీతి యాచంతం ప్రపన్న ముద్దిశ్యేత్యర్థ:. ప్రపన్నసంబంధిసర్వభూతేభ్య: అభయం దదామి" అను అర్థమిచట వివక్షితము. ఒకనాడు ప్రపన్నుడైనచో అతనిని ఉద్దేశించి తత్ సంబంధిభూతులకందఱకు అభయప్రదానమును చేయుదునని పై అన్వయములోని భావము. "వినతవివిధభూతవ్రాతరక్షైకదీక్షే" అనుచోట కూడ "వినతా:, తేషాం వ్రాత: తత్సంబంధివ్రాత ఇత్యర్థ:, తదీయా ఇతి యావత్"- వినతులైన వారి సంబంధమును కలవారిని రక్షింతునని అర్థము.

(అభయదానవిత్యవ్రతీ) - "అభయదానే నిత్యవ్రతీ అభయదాననిత్యవ్రతీ", లేక, "అభయదానేవ నిత్యవ్రతీ" అనియు విగ్రహమును చెప్పనగును. దీనికి "విశ్రుత:" అను దానితో అన్వయము "అభయప్రదానేవ" అనునపుడు తృతీయావిభక్తికి అభేదము అర్థము. దానికి వ్రతమున అన్వయము. కావున "అభయప్రదానాభిన్ననిత్యవ్రతశాలీ" అని అర్థము. తత్తత్కాలమున ముగియునట్టి వ్రతమువంటిదికాక, "అహ రహ స్సంధ్యా ముపాసీత, యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" అని యావజ్జీవిత మనువృత్తమై, అకరణే ప్రత్యవాయము ఏర్పడునట్టి నిత్యవ్రతమై శరణాగతరక్షణము స్వామికి యుండునని తాత్పర్యము.

(న చ ద్వి రభిభాషసే) - రెండు మాటలను పలుకవు. అనగా అంతరంగజనముచే ఉపరోధము కల్గినను నీవు పల్కిన మాటను మార్చవు- అని భావము.

(ఇతి చ) శరణాగతపరిత్రాణము, నిత్యవ్రత మని రెండు మాటలు లేవని తాత్పర్యము.

(స్వోక్తిత: విశ్రుత:) - నీవాక్యముచేతనే ప్రసిద్ధుడవై యున్నావు. "ఏతద్వ్రతం మమ"అనియు, "రామో ద్వి ర్నాభిభాషతే", "ద్యౌః పతేత్ పృథివీ శీర్యేత్ హిమవాం చ్ఛకలీభవేత్, శుష్యే త్తోయనిధి: కృష్ణే వ మే మోఘం వచో భవేత్" ఇత్యాదిస్వవాక్యముల చేతనే ప్రసిద్ధుడవైయున్నావు. ఇది అనుష్ఠానపర్యంతమగుట ఇకపై తెలుపబడుచున్నది.

(యాతుధానాదయః తవ తు యథోక్తకరణం విదు:) - విభీషణుడు మొదలగు వారు నీవు చెప్పినట్లు చేయుటను తెలిసికొనిరి. "సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే, నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్" అని విభీషణుడు శరణాగతిని చేసినపుడు అంతరంగుడగు సుగ్రీవమహారాజు "వధ్యతా మేష దండేవ తీవ్రేణ సచివై స్సహ" అని తోడుగా వచ్చిన మంత్రులతో ఇతనిని చిత్రవధను చేయవలయునని పల్కగా, అరుంతుదమైన ఆ మాటను విని శ్రీరాముడు మనస్సున గాయపడి, పూర్వము అతడు శరణాగతిని చేయుటచే రావణాదులనువలె అతనిని నిరాకరింపక, "యదుక్తం కపి రాజేవ రావణావరజం ప్రతి, వాక్యం హేతుమ దర్థ్యం చ భవద్భి రపి త చ్ఛ్రుతమ్" అనుచు అతని మాటను నిరాకరించి, "ఆనయైనం హరిశ్రేష్ఠ దత్త మస్యాభయం మయా" అని సుగ్రీవుని విభీషణుని తోడ్కొని రమ్మని నియమించెను.

పూర్వము ఉదాహరించిన "యదుక్తమ్" అను శ్లోకముయొక్క అర్థము నిట్లు చెప్పవచ్చును. "వధ్యతా" మనుచు సుగ్రీవుడు పల్కిన మాటను అనువదించుటకు కూడ శక్తి లేనివాడై "యత్" అని శ్రీరాముడు పల్కెను. (ఉక్తమ్) - మనసుతో తలపరాని మాటను నోరు తెరచి పల్కెను. (కపిరాజేన) - "కపి శ్చాసౌ రాజా చ కపిరాజః" స్వయముగా కపియై, కోతిబుద్ధిని చూపుటమాత్రమే కాక, వారికి రాజువై యున్నాడు, అర్థమందాధుడైయున్నాడు. సామాజికులు సాధువులైయున్నచో ఒకవేళ మంచిబుద్ధిని పొందవచ్చును. అదియును లేక కోతులకు రాజుగా నున్నాడు. "కపీనామ్ రాజా కపిరాజః" అను విగ్రహ మిచట వివక్షితము. (రావణావరజం ప్రతి)- "పరిత్యక్తా మయా లంకా మిత్రాణి చ ధనాని చ" అని సర్వసంగపరిత్యాగము చేసి వచ్చిన విభీషణుని గూర్చి వాలి దుందుభి పుత్రుడగు అసురునితో యుద్ధము చేయునపుడు బిలమును మూయుట మొదలగు భాతృద్రోహమును చేసిన ఇతడు చెప్పుచున్నాడు- అని భావము. (వాక్యమ్) - పదసమూహము వాక్యము. "వధ్యతా"మనుచు ఒక పదమును ప్రయోగించిన చాలదా!

"వధ్యతా మేష దండేవ తీవ్రేణ పచివై ప్పహ" అని అనేక పదరూపవాక్యప్రయోగమును చేయవలెనా ? (హేతుమత్) - "ఈదృశమ్ వ్యసనం ప్రాప్తం భ్రాతరం యః పరిత్యజేత్" అని యుక్తినికూడ తెలుపుచున్నారు. (అర్థ్యం చ) - "అర్థా దనపేతమ్"- అనగా అర్థము నుండి వీడనిది. అతని అభిప్రాయమునుబట్టి అర్థ్యము. కాని నా అభిప్రాయమున కాదు, లోకదృష్టిలో కాదు, శాస్త్రదృష్టిలోకూడ కాదు. (భవద్భి రపి తచ్ఛ్రుతమ్) - "శాంతమ్ పాపమ్" అనుచు చెవులను మూసికొని పోవలసియుండగా మీరు ఈమాటలను చెవులను సారించివింటిరికదా !

ఇట్లు అంతరంగజనులు అడ్డుపెట్టినను శరణాగతరక్షణమును చేసి, చెప్పిన విధమున నడచుకొనుటను విభీషణుడు మొదలగువారు దర్శించిరని తాత్పర్యము. ఈరీతిలో అనుష్ఠానపర్యంతముగా శరణాగతరక్షణమును చేయుట నీకు వ్రతమై యుండగా నాపట్ల మాత్రము వ్యర్థమైనదే ! అనుచున్నారు.

(తత్) - ఆ ప్రణత రక్షణము

(కృపణసార్వభౌమే మయి) - కృపణశ్రేష్ఠుడనగు నాపట్ల.

(కథం వితథ మస్తు) - ఎందులకు వ్యర్థ మగును? విభీషణుడు "త్వాం తు ధిక్! కులపాంసనమ్, త్వేవ చాస్మ్యవమానితః" అని లంకలో గతిలేక కృపణుడై యుండుటచే రక్షించితిని- అనినచో విభీషణుడు పృథివిలో ఏకదేశమైన లంకలో గతిలేక నిలచెను. నేను ఈ పృథివియందు అంతట ఏ ఆలంబనమును లేక గతిలేనివాడనై నిలచియున్నాను. ఇట్లు కృపణసార్వభౌముడనై నిలచిన నన్ను రక్షింపవలదా ! అని బాధపడుచున్నారు.

అవ :- విభీషణాదులు సుకృతులగుటచే రక్షించితిని. నీవు చేసిన పాపము అనుభవముచే గాని, ప్రాయశ్చిత్తముచేగాని పోయినచో నిన్ను రక్షింతును - అనినచో, ఒక కాలవిశేషమునందు అభివృద్ధమై, పడవతో దాటుటకు శక్యమైన సముద్రమువలెకాక, ప్రతిక్షణము అభివృద్ధమై, దుస్తరణమైన విలక్షణసముద్రమువలెనున్న నేను చేసిన పాపము కాలమున్నంతవరకు అనుభవించినను నశింపనిది. అట్టి పాపమునకు ప్రాయశ్చిత్తమును కనుగొనలేకుంటిని. భక్తి ప్రపత్తులు సర్వపాపప్రాయశ్చిత్తాత్మకముగా చెప్పబడినవి కదా! అనినచో అవియును అనేక దోషదూషితములు. ఎట్లనగా - ఆ యోగము రజస్తమోగుణ వ్యాప్తముకాని సత్త్వోత్తర మనన్యసాధ్యము. సత్త్వగుణమును కల్గియుండుటయు అనభిసంహితఫలానుష్ఠితయజ్ఞాదికర్మలచే సంభవించును. ఆ కర్మలకు ఉపకరణములైన

దేశ-కాల- తంత్ర- ద్రవ్యాదులు అశుద్ధములగుటచే దోషావిలములు. సాభర్యాదులును అంతఃకరణజయము కలుగక ఇంద్రియవశ్యులై యోగభ్రష్టులైరి. ప్రపత్తికిని తదుపయుక్త జ్ఞానశక్తిమనశ్శుద్ధ్యాదులు అపేక్షితములు. కావున, అవియును ఆహారశుద్ధ్యాదులచే కలుగవలసియుండుటచే, ఆహారాదులు ఇపుడు అశుద్ధములై యుండుటనుబట్టి శంకాపంచకశబలితములై యుండుటచే, మహావిశ్వాసము కల్గుట మిక్కిలి అరుదు అగుటచే ప్రపత్తియు దోషావిలము. ఇట్లు భక్తి, ప్రపత్తులు రెండును దోషావిలములగుటచే ఏ విధముగానైనను పాపములను నివర్తింప మార్గము లేక అలమటించు నాకు అపూర్వమైన ఒక ఉపాయమును నేను నశించుటకు ముందే శీఘ్రముగా కల్పించి, అందు నన్ను ప్రవేశింపజేసి రక్షింపనగును. పూర్వము క్లుప్తమైనదికాక అపూర్వమైయున్న ఒక ఉపాయమును కల్పింప వీలగునా ? అనినచో, శ్రీరంగాదిసర్వప్రపంచధూర్వహుడవగు నీకు అసాధ్యమైనది కలదా ? అని, ఆళ్వార్లు- "పుకున్డు మాఱు పుణరాయే" అను పాశురమున నీ పాదములను చేరుటకు నాకు అపూర్వమైన ఒక ఉపాయమును కల్పించి, ఆ ఉపాయమునందు నేను ప్రవేశించునట్లు చేసి, దాసుని సమస్తదుఃఖములను పోగొట్టి దయచూపవలెను. పూర్వ మున్నదికాక అపూర్వమైయున్న ఒక ఉపాయమును కల్పింపసాధ్యమా? అన్నచో ఒక బాణముతో మహీధరసన్నిభములగు ఏడు సాలవృక్షములను, మహీధరములను భేదించిన నీకు సాధ్యముకానిది కలదా ?- అని ప్రార్థించు విధమున పల్కుచున్నారు.

అనుక్షణసముత్థితే దురితవారిధౌ దుస్తరే
యది క్వచన నిష్కృతి ర్భవతి సాऽపి దోషావిలా ।
తదిత్థ మగతౌ మయి ప్రతివిధాన మాధీయతాం
స్వబుద్ధిపరికల్పితం సపది రంగధుర్య త్వయా ॥ 16 ॥

రంగధుర్య = శ్రీరంగనాథా!, అనుక్షణ సముత్థితే = ఒక్కొక్కక్షణమునందు వృద్ధిచెందిన, దుస్తరే = దాటుటకు సాధ్యముకాని, దురితవారిధౌ = పాపమను సముద్రమునందు, క్వచన = ఒక శాస్త్రములో, నిష్కృతిః= ప్రాయశ్చిత్తము, భవతి యది = ఉన్నచో, సా అపి = అదియును, దోష+ఆవిలా = దోషములచే కళంకితమై యుండును, తత్ = కావున, ఇత్థం = ఇట్లు, అగతౌ = గతి లేని, మయి = నాయందు, స్వబుద్ధి = నీ సంకల్పముచే, పరికల్పితం = కల్పింపబడిన, ప్రతివిధానం= ప్రాయశ్చిత్తము, త్వయా= నీచేత, సపది = వెంటనే, ఆధీయతామ్= చేయబడుగాక!.

ఒక్కొక్క క్షణము వృద్ధి యగుచున్నది, దాటుటకు సాధ్యము కావిదగు పాపమను సముద్రమునందు (సంసారమునందు) ఒక శాస్త్రమున ప్రాయశ్చిత్తము చెప్పబడియున్నను, అది అనేకదోషభూయిష్ఠమైయుండును. కావున దీనిని గ్రహించి నీవు తప్ప వేఱు గతిలేని నాకు నీ సంకల్పజ్ఞానముచే చేయబడినదగు ప్రాయశ్చిత్తము నిర్వహింపబడినది కావలయును.

(అనుక్షణసముత్థితే) - ప్రతిక్షణము పొంగివచ్చునది. చంద్రోదయ-కాలమునందు పొంగునట్టి సముద్రమువలె కాక ప్రతిక్షణము వృద్ధియగుచున్నదని భావము.

(దుస్తరే) - దాటుటకు అశక్యమైన అని అర్థము. ఓడలు మొదలగు వానిచే దాటుటకు వీలయిన సముద్రమువలెకాక ఏవిధముగానైనను దుస్తరమైనది అనిభావము.

(దురితవారిధౌ) - పాపసముద్రమున. -ఊటనీరు, నదీజలము, వర్షజలము మొదలగువానిచే అంతకంతకు సముద్రము నిండునట్లు, అంతకంతకు కరణత్రయముచే చేయబడిన పాపములచే నిండింపబడినదై ఈ సముద్రముండును- అని భావము. మఱియు, మేఘములు సముద్రజలమును ఎంతగా గ్రహించినను అందలి జలము ఎండిపోకుండునట్లే కాలమున్నంతవరకు అనుభవించినను దురితసముద్రము ఎండిపోదు- అని భావము. అనుభవముచే నశింపకున్నను ప్రాయశ్చిత్తముచే నశింపవచ్చునుకదా ! అనినచో, అందులకు సమాధానము పిమ్మట తెలుపబడుచున్నది.

(క్వచన) - ఏదయిన ఒక శాస్త్రములో

(నిష్కృతి ర్భవతి యది) - ప్రాయశ్చిత్త మనునది ఉన్నచో,

(సా అపి) - అదియును

(దోషావిలః)- దోషములచే కలగియున్నదైయుండును. సేతుస్నాన చాంద్రాయణాదులు కొన్ని పాపములకు మాత్రము ప్రాయశ్చిత్తము అగునే కాని, మహాపాతకసంచితాది సర్వప్రాయశ్చిత్తము కాలేదు. అట్టి ప్రాయశ్చిత్తమును సామాన్యధర్మశాస్త్రములలో చూడలేము - అని భావము.

(క్వచవ) - ఒక విశేషశాస్త్ర మున్నచో, అనగా - భక్తి, ప్రపత్తి విధాయక మోక్షశాస్త్రమున్నచో- అని అర్థము. “ఋతే యోగాత్ కర్మకషమ్”, “క్షీయంతే చాస్య కర్మాణి”, “సర్వపాపేభ్యో మోక్షయిష్యామి” ఇత్యాది విశేషశాస్త్రములలో భక్తిప్రపత్తులు

సర్వపాపప్రాయశ్చిత్తముగా చెప్పబడినను అవియును ముందు చెప్పినట్లు దోషావిలములే- అని భావము. (లేక) (క్వచన) - ఎవరైన విశిష్ట పురుషునియందు- అని అర్థము. వ్యాస-పరాశరాదులయందు భక్తియు, పరాంకుశాదులలో ప్రపత్తియు నిష్కృతియై, సర్వపాప నివర్తకమైనను, ఆహారశుద్ధి- మనశ్శుద్ధ్యాదు లేమియు లేని నాయందు అవి దోషావిలములే అగును- అని భావము.

(తదిత్థ మగతౌ) - కావున ఈ విధముగా వేఱు ఉపాయము లేని.

(మయి)-నాయందు. నిర్దుష్టమైన ద్రవ్యమంత్రాదులను సంపాదించుకొని కర్మ యోగాదులను అనుష్ఠించుటకు, అంతరాయము రాకుండ భక్తియోగము అనుష్ఠించుటకు, పురుషకారపంచకవిశేషవిమర్శజన్యమహావిశ్వాసముతో ప్రపత్త్యనుష్ఠానమును చేయుటకును ఏ విధముగానైన శక్తిని లేని నాయందు- అని భావము.

(రంగధుర్య)- శ్రీరంగాదిసర్వప్రపంచధూర్వహా !

(స్వబుద్ధిపరికల్పితమ్) - నీకు అసాధారణమైన సర్వజ్ఞత్వమును గొని కల్పింపబడిన.

(ప్రతివిధావమ్) - సర్వపావనివర్తకమై, అపూర్వమైయున్నదగు ఒక ప్రాయశ్చిత్తమును.

(పపది త్వయా ఆధీయతామ్)- శీఘ్రముగా నీచే చేయబడవలెను. మరునాడు చేయుదును అనిన భరింపలేను. అంతవరకు ఆత్మ నిలువజాలదు. ముందు శ్లోకమున "కృపణసార్వభౌమే మయి" అని పల్కిన కార్పణ్యముయొక్క అతిశయమును తెలుపుటయే ఈ శ్లోకతాత్పర్యము.

అవ :- కాలతత్త్వమున్నంతవరకు అనుభవించినను తీరని మహాపాపమును చేసిన నేను జయించుటకు అశక్యమై, విషాదకరమైన శబ్దాదివిషయవర్గమువలన నీ అనుభవవిచ్ఛేదము కలుగునని భయపడుచున్నాను. లేక, విషయములు నన్ను బాధించు చున్నవని భయపడుట లేదు, ఇట్లు త్వదనుభవైకధారక -పోషక- భోగ్యుడనగు నన్ను రక్షింపవలయును. ఒకనిని వేఱొకడు రక్షించుట వీలుపడునదియా !- అనినచో, నేనుకదా ! వీరికి నాథుడను, నేను రక్షింపకున్న వేఱే రక్షించువారెవ్వరైన కలరా ? వారు రక్షింపవలసిన సంబంధమును కల్గినవారా? అను అర్థములను నోటితో పల్కినచో సులభముగా రక్షింపవచ్చును అని తలచి, నిర్దయులగు కంసవేనాదులు పృథివీనాథులైయున్నట్లా నీవు ఉన్నది! "బ్రాహ్మణానాం ధనం వేదః" అని బ్రాహ్మణులకు వేదము ధనమై యున్నట్లే,

దయ నీకు ధనముకదా ! నన్ను రక్షింపవలదా ? అనుచు, ఆళ్వార్లు విషయములను చూచి భయపడి - "అణ్ణలే ! యముదే ! యప్పనే ! యెన్నై యాళ్వానే" అని ఎలుగెత్తి పిలిచినట్లు "హే రామ ! సత్యవ్రత !దీర్ఘబాహో !"అని సీతాదేవి పిలచినట్లు, "దయాధన! జగత్పతే ! దయితరంగ ! సంరక్ష మామ్" అని ఎలుగెత్తి కవి పిలుచుచున్నారు.

విషాదబహుళా దహం విషయవర్గతో దుర్జయాత్
బిభేమి వృజినోత్తర స్త్వదనుభూతివిచ్ఛేదతః ।
మయా నియతనాథవా నయ మితి త్వ మర్థాపయన్
దయాధన జగత్పతే దయితరంగ సంరక్ష మామ్ ॥ 17 ॥

వృజిన+ఉత్తరః = పాపభూయిష్ఠుడనగు, అహం =నేను, విషాదబహుళాత్ = దుఃఖములచే నిండినది, దుర్జయాత్ = జయింప వీలుకానిది, అగు, విషయవర్గతః = విషయ సమూహమువలన కలుగు, త్వదనుభూతి = నీ అనుభవముయొక్క, విచ్ఛేదత= విచ్ఛేదమునకు, బిభేమి = భయపడుచున్నాను, దయాధన = దయను ధనముగా కల్గినవాడా !, జగత్పతే = జగత్తుకు స్వామీ !, దయితరంగ = ప్రియమైన శ్రీరంగమును కలవాడా !, అయం = ఇతడు, మయా = నాచే, నియతనాథవాన్ = నియమముగా నాథుని కలవాడు, ఇతి = అని, త్వం = నీవు, అర్థాపయన్ = పల్కుచు, మాం = నన్ను, సంరక్ష = రక్షింపుము.

శ్రీరంగమున మిక్కిలి ప్రీతిని కలస్వామీ !, మహాపాపియగు నేను దుఃఖములచే నిండినది, జయింప శక్యము కానిది అగు విషయసమూహములవలన నీ అనుభవమునకు విచ్ఛేదము కల్గునని భయపడుచున్నాను. "ఇతడు నన్ను స్వామిగా కల్గినవాడుకదా !" అని పల్కుచు అనన్యగతికుడనగు నన్ను రక్షింపుము.

(వృజినోత్తరః) - "వృజినై రుత్తరః వృజినోత్తరః" అని విగ్రహము. పాపప్రచురుడనైన- అని అర్థము. నీవు ఆనందప్రచురుడవైనట్లే నేను పాపప్రచురడనైతినని తాత్పర్యము. విషయాక్రాంతుడనై, నిన్ను అనుభవింపకుండునట్లు, ఎన్ని వేల కల్పములు అనుభవించినను తీరనట్టి పాపములను నేను చేసితినని, "మహ దస్తి వ సంశయః" అని సీతాదేవి శోకించినట్లు బాధపడుచుంటినని తాత్పర్యము.

(విషాదబహుళాత్) - దుఃఖబహుళమైన. ఒక్కొక్కవిషయమే అనేకవిధ దుఃఖకరమై యున్నదని భావము.

(దుర్జయాత్) - జయింప సాధ్యము కాని. శ్రీరామునిపట్ల గొప్ప ప్రేమను కల (స్నేహమునుకల) సుగ్రీవమహారాజును శ్రీరాముని పిడుగుకు, మెఱపుకు, వర్షమునకు లక్ష్యము చేసి, ఇంద్రియవశుడై, నాల్గు మాసములు అతనిని మఱచెనుకదా! ఇట్లు అత్యంతము దుర్జయమైన విషయములు నాచే జయింప వీలగునా !- అని భావము.

(విషయవర్గతః) - నీ అనుభవవిచ్ఛేదమువలన.

(బిభేమి) - భయపడుచున్నాను. అనేకవిధములైన దుఃఖమును కల్గించునట్లు అనేకవదనములను కల్గినవగు అనేక సర్పములు మణిమంత్రాదులకు అణగక ఒకనిని పీడించునట్లు, అతిరథ-మహారథులగు పలువురును కలసి బాలుడగు అభిమన్యుని పీడించినట్లు విషయములు నన్ను బాధించుచున్నవి. "ఇమా మసితకేశాంతాం శతపత్రనిభేక్షణామ్, సుఖార్హాం దుఃఖితాం దృష్ట్వా మమాపి వ్యథితం మనః" అని రాత్రియందు సీతాదేవియొక్క దుఃఖమును చూచి హనుమానుడు సహింపలేకపోయెను. అట్టి వ్యసనమును సీతాదేవి పలు దినములు అనుభవించినట్లు నేను విషయములచే బాధపడుచున్నాను. ఆ విషయములు పరస్పరము ఉపకరణి -ఉపకరణ భావమును పొందినవి కాక, సమప్రధానములై యున్నవి. వీనినన్నిటిని సహింపవచ్చును. "గజం వా వీక్ష్య సింహం వా వ్యాఘ్రం వాऽపి వరాననా, నాహారయతి సంత్రాసం బాహూ రామస్య సంశ్రితా" అనునట్లు నీ అనుభవరూపమైన అవష్టంభమున్నదా? అనిన, అదియు లేదు- అని శోకించుచున్నానని ఘట్టార్థము. నేను నిన్ను రక్షించుటకు ప్రాప్తి (తగిన సంబంధము) కలదా- అనినచో కవి అందులకు సమాధానమును ఇపుడు పల్కుచున్నారు.

(అయం) -ఇతడు

(మయా నియతనాథవాన్) - నన్ను నియమముగా నాథునిగా కల్గినవాడని అర్థము.

(ఇతి) - అని

(త్వ మర్థాపయన్ మాం పంరక్ష) -నీవు పల్కుచు నన్ను రక్షింపవలయును. "సర్వదేశ- సర్వకాల- సర్వావస్థలయందు నేనుకదా ఇతనికి నాథుడను, వేఱే నాథుడు కలడా ! నాథుడు అనాథుని రక్షింపవలదా !" అను అర్థమును నీవు మనస్సుతో తలచుటయేగాక వాక్కుతోకూడ పల్కినచో సులభముగా రక్షింపవచ్చునని భావము. "మాతః స్తన్యం దేహి" అని అడుగుటకుకూడ తెలియక ఏడ్చు బిడ్డకు తల్లి -"అయ్యో!

నా బిడ్డ ఆకలితో ఏడ్చుచున్నాడే!" అని బాధపడి, పరుగెత్తుకొని వచ్చి, స్తన్యమునిచ్చి రక్షించునట్లు "త్వ మేవ నాథః" అని చెప్పుటకుకూడ తెలియకుండనున్న నన్ను నీవు "నేను నీకు నాథుడను" అని పల్కుచు రక్షింపవలయునని తాత్పర్యము.

(దయాధవ) - "బ్రాహ్మణానాం ధనం వేదః" అని బ్రాహ్మణులకు వేదము ధనమగునట్లు నీకు దయయేకదా ధనము. నాథుడననుటయే గాక, దయతో రక్షింపవలదా!

(జగత్పతే) - దాసుడనగు నాయందు విశేషాకారము లేకున్నను సర్వ జగత్స్వామి అను సామాన్యాకారమును చూచి అయినను రక్షింపనగును.

(దయితరంగ) - "దయితం ప్రీతివిషయీభూతం, రంగం రంగక్షేత్రం యస్య సః" అని విగ్రహము. శ్రీరంగక్షేత్రము నీకు ప్రీతివిషయమగుటచే ఆ క్షేత్రవాసుడనగు నన్ను ఆ క్షేత్రవాసి అను సంబంధమును గొని, "భవద్విషయవాసినః" అని విషయవాసమే నిమిత్తముగా ఋషులకు విరోధులగు రాక్షసులను శిక్షించునట్లు, వారికంటెను క్రూరులగు తురుష్కయవనులను, విషయములను నివర్తింపచేసి నన్ను రక్షింపవలయునని తాత్పర్యము.

అవ :- ఈ శ్లోకమునకు రెండు విధములైన అన్వయములు చూపబడుచున్నవి. మొదటి యోజన (అన్వయము) -

సర్వసంపత్సమృద్ధుడవగు నీకు స్వభావసిద్ధముగనే పాపములు, తత్ప్రయుక్త క్లేశాద్యనిష్టములును లేవు- అని శ్రుతులు ఉద్ఘోషించుచున్నవి. అట్లు అనిష్టాభావము స్వభావ మగుటచే సృష్టివలె సంహారమును నీకు వీలయైనది. అందుచే నాబాధయు నీకు వీలయైనది. అయినను శరణాగతప్రణయభంగభీతుడవై నీవుందువుకదా ! కావున శరణాగతుడనగు (నన్ను చేయి విడవకుము) నా ఇష్టమును విడువకుము- అని కవి పల్కుచున్నారు.

**నిసర్గనిరనిష్టతా తవ నిరంహసః శ్రూయతే**
**తత స్త్రియుగ! సృష్టివత్ భవతి సంహృతిః క్రీడితమ్ ।**
**తథాపి శరణాగతప్రణయభంగభీతో భవాన్**
**మదిష్ట మిహ య ద్భవేత్ కి మపి మా స్మ తజ్జీహపః ॥ 18 ॥**

త్రియుగ = షాడ్గుణ్యపూర్ణుడా !, నిరంహసః = పాపము లేని, తవ = నీకు, నిసర్గ = స్వభావముగనే, నిరనిష్టతా = అనిష్టములేకుండుట అనునది, శ్రూయతే =

వినబడుచున్నది, తత: = కావున, సృష్టివత్ = సృష్టివలె, సంహృతి: = సంహారమును, క్రీడితం = క్రీడగా, భవతి = అగుచున్నది, తథాపి = అట్లయినను, భవాన్ = నీవు, శరణాగత = శరణాగతుల, ప్రణయ = స్నేహముయొక్క, భంగ = భంగమువలన, భీత: = భయపడినవాడవు, ఇహ = ఈ లోకమున, కి మపి = విలక్షణమైనది, యత్= ఏది, మదిష్టం = నాకుఇష్టమైనదిగా, భవేత్ = అగునో, తత్ = దానిని, మా స్మ జీహప: = విడువకుము.

షాడ్గుణ్యపరిపూర్ణుడవైన స్వామీ ! ఏవిధమైన పాపము ఏ సమయమునందైనను లేని నీకు స్వభావసిద్ధముగా అనిష్టము లేమియు లేవు అని చెప్పబడుచున్నది. కావున నీకు లోకసృష్టి ఎట్లు క్రీడయో అట్లే సంహారమును క్రీడ యగుచున్నది. ఇట్లయినను, నీవు శరణాగతులపట్లగల స్నేహముయొక్క భంగమువలన భయపడు వాడవుకదా! కావుననే శరణాగతుడనగు నాకు ఈ ప్రకృతిమండలములో ఏది సుఖకరమైయుండునో దానిని నీవు చేయవలయును.

(త్రియుగ) "త్రీణి యుగాని యస్య స:" అని విగ్రహము. జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్యతేజస్సులను ఆఱు గుణములను కలవాడా ! దీనిచే అవాప్తసమస్తకామత్వము తెలుపబడినది.

(విరంహస:) - "నిర్గత: అంహ: పాపం యస్మాత్ స:, తస్య" అని విగ్రహము. పాపముయొక్క అత్యంతాభావమందు- అని తాత్పర్యము. ఏవిధమైన పాపమును లేనివాడని అర్థము.

(తవ) - నీకు.

(విసర్గనిరనిష్టతా) - "విసర్గేణ నిరనిష్టతా". స్వభావత ఏవ అనిష్టములు లేవనుట. ముక్తునకు పూర్వకాలమున క్లేశాది అనిష్టము లుండి, ఉత్తరకాలమునందు లేకుండపోయినట్లు, నిత్యులకు భగవత్సంకల్పమువలన అనిష్టములు లేకుండునట్లు కాక, సర్వకాలములందు స్వత: సిద్ధముగానే అనిష్టములు లేవని భావము.

(శ్రూయతే) - "అపహతపాప్మా విజరో విమృత్యు:", "పర: పరాణాం పరమం మహేశ్వరమ్", "సకలా వ యత్ర క్లేశాదయ స్సంతి పరావరేశే" ఇత్యాది శ్రుతి పురాణాదివచనములచే చెప్పబడచున్నది. కావున అవాప్తసమస్తకాముడవగుటచే, స్వభావముచే పాపములు, తత్కార్యానిష్టములును లేకుండుటచే- అని తాత్పర్యము.

(సంహృతి: సృష్టివత్ క్రీడితమ్) - సంహారముకూడ సృష్టివలె క్రీడ అగుచున్నది. క్రీడిత మనునపుడు భావేక్త ప్రత్యయము. అనిష్టములు లేకున్నను తన్మూలభూతపాపము లున్నచో అనిష్టములు ఏదైన ఒక సమయమున కలుగవచ్చును. మహారాజులకు ఉద్యానసృష్టి పుణ్యావహమై, లీలయైయుండును. దానిని పాడుచేసిన పాపము కల్గుటచే ఉద్యానసంహారము లీల కాదు. అట్లు నీకు సంహారములచే పాపము కల్గినకదా క్రీడ కాదు. అదియును లేదు. మఱియు, నీవు సమస్తకాముడవు. కావున సృష్టివలె జగత్సంహారమును వీలయైనది. సంహారముచే జగత్తు పొందు హింసను నీవు తెలిసినచో దానిచే నీకు క్లేశము కల్గుటచే అది వీలుకాదు, సంహారమును చేయవు కూడ. ఆగర్భశ్రీమంతునకు దరిద్రుడు పడు కష్టము తెలియదుకదా ! లీల అనునది ఆనందజనకవ్యాపారవిశేషము. కందుకాదిలీలయు తత్పరునకు మర్మస్థానములో తగిలి బాధ కల్గినచో అతనికి బాధ కల్గి లీల కాదు. కావున ఏ విధముగా చూచినను, నీకెట్టి క్లేశము, అనిష్టము లేకుండుటచే సృష్టివలె సంహారమును క్రీడ అయ్యెనని భావము. ఇచట సామాన్యముగా జగత్సంహారమును లీలగా చెప్పినందులకు తమను విషయములచే, తురుష్కాదులచే హింసింపజేసి సంహరించు విశేషమందు, సాధువులను తురుష్కాదులచే హింసింపజేసి, వారిని పారిపోవునట్లు చేయుట అనెడి సంహృతి విశేషమందును తాత్పర్యము. ఇతరులు పొందు కష్టము ఇట్టిదైయున్నదని నీకు తెలియకపోవుటచే కదా నేను పొందు కష్టము నీకు తెలియలేదు. కావున ఇట్లు హింసించుచుంటివి- అని ఘట్టార్థము.

(తథాపి) - అయినను. సంహారమును లీల అయిననను- అని భావము.

(భవాన్) - నీవు

(శరణాగతప్రణయభంగభీత:) - శరణాగతుని స్నేహమునకు కొఱత కల్గిన ఏమి చేయుదును? అని భయపడినవాడవు- అని ఇట్లు సామాన్యముగా అర్థము చెప్పినను, శరణాగతులగు దేశికుల స్నేహమునకు కొఱత వచ్చునని ఈశ్వరుడు భయపడువాడే- అని ప్రకృతమున విశేషార్థమును చెప్పనగును.

(మదిష్ట మిహ యత్ భవేత్) - ఈ లోకమున నా కిష్టముగా ఏది అగునో?

(తన్మాస్మజీహప:) - దానిని విడువకుము. నాఇష్టము వాచామగోచరము. అది ఈ లోకమున ప్రకృతిబద్ధుడనైయున్నప్పుడు ముక్తతుల్యానుభవమును పొందవలయునని

భావము. దీనిని **"శునా మివ పురోధసః"** అనునట్లు అత్యంతము అధముడనైన నేను వాక్కుతో అడుగుటకు లజ్జగానున్నది. దానిని నీవే గ్రహించి, విడువక సాధింపనగును- అని తాత్పర్యము. లేక, ఇష్టానిష్టములు ఇట్టివని నాకు తెలియలేదు. దానిని సర్వజ్ఞుడవగు నీవే తెలిసికొని, విడువక చేయవలయునని భావము. "యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే" అని ప్రతర్దనుడు ఇంద్రుని అడిగినట్లు కవి భగవానుని అడుగు చున్నారు.

శ్లోకమునకు రెండవ అన్వయము :-

ఇట్లు "అభీతి రిహ" అను మొదటిశ్లోకమునుండి "దయాధవ ! జగత్పతే! దయితరంగ ! సంరక్ష మామ్" అనునంతవరకు ప్రార్థించినను భగవానుడు ఆలయములో అభిముఖుడై సమీపములోనున్నను ఆదరముతో కవికి ముఖమును చూపి, అభీష్టప్రదానమును చేయకపోవుటచే, కించిత్ ప్రణయకోపయుక్తులైన కవి స్వామిని ఉపాలంభించుచున్నారు. శ్రీరాముడు వనమునకు వెడలునపుడు "అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్" ఇత్యాదిగా తానుకూడ వెంటనే వచ్చెదని ప్రార్థించిన సీతాదేవి తన మనోరథపూర్తి కాకుండుటచే "ప్రణయా చ్చాభిమానా చ్చ పరిచిక్షేప రాఘవమ్" అని ప్రణయకోపముతో శ్రీరాముని ఉపాలంభించెను. "కచ్చిత్ కుశలీ కృష్ణః" అని పల్కిన గోపికలే "అథవా కిం తదాలాపైః" అనిరి. ఆళ్వార్లు తమమనోరథపూర్తిని చేయకపోవుటచే "మిన్నిడై మడవార్" అను దశకములో స్వామిని ఉపాలంభించిరి. కలియన్ కూడ అట్లే "తెన్నిలిజై యావ్ శిదటి" అను పాశురమున ఉపాలంభించిరి. జ్ఞానశక్తి బలైశ్వర్యవీర్య తేజస్సులు అను షాడ్గుణ్యసంపద నీకు ఉండుటతోపాటు, క్లేశాద్యనిష్టములును, దానికి మూలమైన పాపములును స్వభావసిద్ధముగనే నీకు లేకపోవుటచేకదా నేను పడుపాట్లు అన్నియు నీకు తెలియలేదు. ఆగర్భశ్రీమంతునకు ఇతరుల పేదరికపు బాధలు తెలియునా! అనిష్టములు నాకు లేవని నీవు ఎట్లు గ్రహించితివి?- అనినచో, నిత్యనిర్దోష -అపౌరుషేయములు అగు వేదములు అట్లు ఉద్ఘోషించుచున్నవి. ఇట్లు క్లేశాద్యనిష్టములు లేని నీకు లీలయగుచున్నది. (వరిక్కు విళైయాట్టు - వణ్డుక్కు జీవన్ పోకిఅదు) "నక్కకు చెలగాటము- ఎండ్రికి ప్రాణసంకటము" అనునట్లు నీ లీల నాకు క్లేశావహమైయున్నది. కావున పరహింసైకస్వభావుడగు నీకు మాతో సంబంధము లేదు. ప్రణయము లేదు - అనుచు కవి పలుకగా, భగవానుడు- అయ్యో ! ఇతడు కుపితుడైనట్లున్నాడే ! ఏమి చేయుదును! అని ససంభ్రమముగా వేగముగా వచ్చి నిలచి, సంహారము నాకు లీలయైనను

ఆశ్రితుని రక్షింపకున్నచో "ఏవం దోషో మహా వత్ర ప్రపన్నానా మరక్షణే" అని నాకు మహాదోషము వచ్చుటతోపాటు ఆశ్రితులు నాపట్ల ప్రణయమును వీడినచో నేను మహాభయమును పొందినవాడను అగుదును కదా ! ఆళ్వార్లు చిరకాలము విశ్లేషించి దూతప్రేషణమును చేసినను, నేను పశువుల మేపుటకు క్షణకాలము ఆలస్యము చేయగా మిక్కిలి అవసన్నులై ఇక అతడు వచ్చినను కటాక్షింపబోము - అని నిశ్చయము చేసికొని నిలువగా, నేను దానిని సహింపలేక మిక్కిలి అవసాదమును పొందినవాడనై, భయాక్రాంతుడనై, పరుగెత్తి వచ్చి ఆళ్వార్ల పాదములందు పడి, స్వాపరాధమును క్షమింపవేడుటకు అవకాశము లేకుండ తడబడి నిలచుట నీకు తెలియనిదా ? నీవు నాయందు ప్రణయమును వీడిన నేను భయాక్రాంతుడనైయుందును కదా ! -అని పలుకగా, నీవు శరణాగత ప్రణయభంగభీతుడవు అగుట నేను తెలియుదును. నీకు నాకంటె ఇష్టమైన వస్తువు వేఱొకటి కలదు. దానిని నీవు విడువకుము. ఆ వస్తువు ఏదియో నాకు తెలుపుము. దానిని ఇట్టిదని నీవు స్వబుద్ధిచే తెలిసికొనుము- అని ముఖము పక్కకు తిప్పుకొని ఉపాలంభించుచు పల్కుచున్నారు.

(త్రియుగ)- షాడ్గుణ్యపరిపూర్ణా ! సర్వసంతృప్తసమృద్ధుడవగు నీకు ఇతరుల క్లేశములు తెలియునా?- అని భావము.

(విసర్గనిరనిష్టతా) - "న విద్యతే అనిష్టం క్లేశం యస్య స: నిరనిష్ట:. తస్య భావ: నిరనిష్టతా". స్వభావసిద్ధమైన అనిష్టాభావము, క్లేశాద్యనిష్టా భావము- అని అర్థము.

(నిరంహస:) - పాపము లేని.

(తవ) -నీకు

(శ్రూయతే) - "అవహతపాప్మా" ఇత్యాది శ్రుతిస్మృత్యాదులచే తెలుపబడుచున్నది. స్వభావమువలన క్లేశాద్యనిష్టములును, తన్మూలపాపములును నీకు లేకపోవుటచే ఇతరుల క్లేశములు తెలియ లేదు. నిన్ను వీడినవారు పడు క్లేశమును నీవు తెలియవని తాత్పర్యము.

(తత:) - అనిష్టములు నీకు ఏవిధముగాను లేకపోవుటవలన -

(సృష్టివత్ సంహృతి: క్రీడితం భవతి) - సృష్టివలె సంహారమును క్రీడయగుచున్నది. అట్లే, నీవును చేయి విడచి, శబ్దాదివిషయములతో, యవనాదులతో నన్ను

పీడించుట నీకు లీలయైనది- అని తాత్పర్యము. కావున నీకు నాతో సంబంధము లేదు. ప్రణయమును లేదు- అనునది కవి భావ మనుట ఇచటి హార్దాభిప్రాయము.

ఇట్లు కవి పలుకగా, భగవానుడు నేను జగద్రక్షణచింతనలోనుండి క్షణము ఆలస్యము చేసిన అందులకు ఇట్లు పలుకతగునా ? సంహారమునుకూడ నాకు లీలయైనను, శరణాగతులు నాపట్ల ప్రణయమును విడచిన ఏమి చేయుదును?- అని భయపడినవాడనై నేను ఉండును కదా - అని పలుకగా అందులకు సమాధానమును కవి పిమ్మట పల్కుచున్నారు.

(తథాపి) - సృష్టివలె సంహారముకూడ క్రీడయైనను

(భవాన్) -నీవు

(శరణాగతప్రణయభంగభీత:) - శరణాగతుని ప్రణయమునకు భంగము కల్గునని భయపడినవాడవు. ఇచటి శరణాగతప్రణయభంగము శరణాగతకర్తృకము. శరణాగతుడు తన ప్రణయమును వీడిన ఏమి చేయుదును? అని భయపడువాడవు. అని భావము. అది సత్యము. ఇట్లు శరణాగతకర్తృక మనునది "భీత:" అనుటచే సూచితము. లోకమున మిత్రుని విషయమున ద్రోహము చేసిన ఆ మిత్రుడు తనయందుగల స్నేహమును విడుచునను భయము ప్రసిద్ధముకదా ! అట్టి భాగ్యమును చేసినవారెవ్వరో ? నేను కాదు- అని ఇచటి తాత్పర్యము. అయినచో, నీవు నాకు ఇష్టమైన వస్తువుకదా ! అని అతడు పలుకగా, అందులకు ప్రత్యుత్తరమును కవి పల్కుచున్నారు.

(మత్)- నాకంటెను

(ఇహ) - ఇచట ఈలోకమున

(కి మపి)- అనిర్వచనీయప్రీతివిషయమైన

(యత్) - ఏ వస్తువుకలదో

(తత్) - దానిని

(మా స్మజీహప:) - "విడువకుము. నాకంటె అనిర్వచనీయమైన ప్రీతివస్తువు వేఱొకటి నీకు కలదు. ఇది నిశ్చయము. దానిని విడువకుము. అచటికే నీవు పొమ్ము." అని పల్కుచున్నారని భావము. నాకంటె ఇష్టమైన వస్తువును నీవు విడువకుము, అచటికే పొమ్ము- అని పలుకక, "మదిష్ట మిహ య ద్భవేత్ కి మపి మా స్మ జీహప:' అనుటచే

ఔదాసీన్యము స్ఫురించుచున్నది. నమ్మాళ్వార్లు "వైకల్ పూమ్ కళివాయ్" అను తిరువాయ్‌మొళిదశకమున ఘటకముఖముగా ప్రార్థించినను, భగవానుడు వేంచేయ కుండుటచే ప్రణయరోషావిష్టులై అతడు వచ్చినను కటాక్షింపబోము అని నిశ్చయమును చేసికొనగా, భగవానుడు దానిని భరింపలేక, వేగముగా వచ్చినను ఆళ్వార్ల పాదములందు పడి అపరాధక్షామణమును చేయుటకుకూడ అవకాశములేకుండ పోవుటచే ఆత్మ ధారణమును చేయుటకు సమర్థులు కానివారై, ఆత్మధారణార్థము ఆళ్వార్ల బంతిని, గచ్చకాయలను గైకొని సర్వాంగములందు హత్తుకొని ఆశ్వస్తుడైనట్లు, దేశికులు అచ్యుత శతకమున ఘటకముఖముగా స్వామిని ప్రార్థించినను, ముమ్మణిక్కోవై అను గ్రంథమున విరహార్తులై ఎలుగెత్తి పిలచినను అతడు రాకపోవుటచే ప్రణయకోపమును చెందినవారు కాగా, దానిని సహింపలేక భగవానుడు పరుగున వచ్చినను, నాయికాభావమును పొందిన దేశికులు అభిముఖులు కాకుండుటచే ఆత్మధారణాక్షముడై, ఆత్మధారణార్థము అచేతనములగు బంతి, గచ్చకాయలు మొదలగు దేశికుల లీలోపకరణములను గ్రహించి ఆశ్వాసమును పొంది, లబ్ధాత్మకుడైయున్న స్వామిని చూచి దేశికులు, నా బంతిని, గచ్చకాయలను తిరిగి ఇచ్చి, పొమ్ము -అను విధమున పల్కిరనుట ఇచట వ్యక్తమగు చున్నది. "శినైకవర్ పిరాకిరుద మాఱు కూఱి చ్చెన్దమిళ్ ముమ్మణి క్కోవై శెరియ చ్చేర్త్తు పన్దు కళలమ్మానై యూశలేశల్ పరవ వవమణిమాలై యివైయుమ్ శొన్నేన్" అనుచు దేశికులు స్వయముగా పల్కిరికదా!

అవ:- ఇట్లు దేశికులు పల్కిన మాటను విని భగవానుడు కలత చెంది, నీకంటె నాకు వేఱే ఇష్టమైన వస్తువుకలదా ? "ఇమౌ స్మ మునిశార్దూల కింకరౌ సముపస్థితౌ" అనునట్లు మీరు నియమింపగా కైంకర్యమును చేయునట్టి కింకరుడనుకదా నేను ! "క్రియతా మితి మాం వద" అనునట్లు కైంకర్యమును నియమింపవలెనని వినీతుడై పలుకగా, దేశికులును కొంచెము ఉపశమించి "వైరాగ్యవిజితస్వాంతైః ప్రపత్తివిజితేశ్వరైః " అనునట్లు మిక్కిలి శ్రేష్ఠతములు, యతీంద్రమహానసికపాత్రులగు అప్పుళ్లార్ అను ఆచార్యుల కటాక్షవిశేషపాత్రుడనగు నన్ను విశేషించి కటాక్షింపవలసియుండగా, కనీసము ప్రహ్లాదులనువలె అయినను నా భయమును తీర్చి రక్షించిన వారివలె నిర్భయుడనై యుందునని, "సామాన్యప్రతిపత్తి పూర్వక మియం దారేషు దృశ్యా త్వయా" అని సంయమధనుడగు కణ్వమహర్షియొక్క పుత్రిక అను ఆకారమును గొని మాన్యప్రతిపత్తి పూర్వకముగా గ్రహింపవలసియుండగా, మిగిలిన భార్యలనువలె సామాన్యముగా గ్రహించినను చాలునని పల్కినట్లు, ఇందు పల్కుచున్నారు.

కయాధుసుతవాయసద్విరదపుంగవద్రౌపదీ-
విభీషణభుజంగమవ్రజగణాంబరీషాదయః ।
భవత్పదసమాశ్రితాః భయవిముక్తి మాపు ర్యథా
లభేమహి తథా వయం సపది రంగధుర్య త్వయా ॥ 19 ॥

రంగధుర్య = శ్రీరంగనాథా !, కయాధుసుత = హిరణ్యాకశిపుని కుమారుడగు ప్రహ్లాదుడు, వాయస = కాకాసురుడు, ద్విరదపుంగవ = గజేంద్రుడు, ద్రౌపదీ = ద్రౌపది, విభీషణ = విభీషణుడు, భుజంగమ = సుముఖి అను సర్పము, వ్రజగణ = గోకులములోని జనము, అంబరీష = అంబరీషుడు, ఆదయః = మొదలగువారు, భవత్పద = నీ పాదములను, సమాశ్రితాః = ఆశ్రయించినవారై, యథా = ఎట్లు, భయవిముక్తిం = (సంసారముయొక్క) భయనివర్తనమును, ఆపుః = పొందిరో, తథా = అట్లు, వయం= మేము, సపది = వెంటనే, త్వయా = నీచే, లభేమహి = పొందెదము.

ప్రహ్లాదుడు, కాకాసురుడు, గజేంద్రుడు, ద్రౌపది, విభీషణుడు, సుముఖి, (కాళియుడు) గోకులములోని జనము, అంబరీషుడు మొదలగువారు నీ పదములను ఆశ్రయించి తమ భయమును ఎట్లు తీర్చుకొనిరో, అట్లే మేమును నీవలననే భయమును పోగొట్టుకొనెదము, ప్రహ్లాదుడు తన తండ్రియగు హిరణ్యకశిపుడు పెట్టిన హింసను భరింపలేక స్వామిని శరణువేడగా, స్వామి నరసింహరూపుడై అవతరించి, అతనిని సంహరించి, ప్రహ్లాదునకు భయమును తీర్చెనని పురాణకథ. తనను శరణువేడుటచే కాకాసురుని బ్రహ్మాస్త్రమునుండి రక్షించెనని శ్రీరామాయణమున కలదు. అట్లే, మిగిలిన వృత్తాంతములు ఇతిహాసపురాణప్రసిద్ధములు. "భుజంగమ" అనుటకు కాళియుడనియు అర్థమును చెప్పవచ్చును.

(కయాధుసుత ......అంబరీషాదయః) - కయాధుసుతుడు ప్రహ్లాదుడు, వాయసము- కాకాసురుడు, ద్విరదపుంగవుడు- గజేంద్రుడు, భుజంగమము అనగా సుముఖుడు. ఒకానొక సమయమున భగవానుడు గరుడుని అధిరోహించి సంచరించి నపుడు గరుడుడు క్షుధార్తుడై భూమిలో సంచరించు సుముఖుడను సర్పమును భక్షింప బోయెను. సుముఖుడు భయాక్రాంతుడై భగవానుని శరణువేడెను. భగవానుడు వైనతేయుని ఆసర్పమును భక్షింపకుండునట్లు పైకి లాగగా, ఆ అవకాశమున సుముఖుడు పుట్టలో దూరెను- అను పౌరాణిక కథ ఇచట అనుసంధేయము. అంబరీషచక్రవర్తివద్దకు దుర్వాసుడు ద్వాదశీదినమున భిక్షకు వచ్చుచున్నానని పల్కి, అతనిని పరీక్షింపగోరి,

స్నానమునకు పోయి, ఆలస్యము చేయగా, పారణ సమయము అతిక్రమించుచున్నదను భయముతో అంబరీషుడు జలపారణమును చేసి ప్రతీక్షించెను. దుర్వాసుడు వచ్చి, జలపారణమును చేసిన అంబరీషుని చూచి కుపితుడై, అతనిని సంహరింపబోగా, అంబరీషుడు సుదర్శనుని శరణువేడగా, సుదర్శనుడు దుర్వాసుని తఱిమికొట్టి, తిరిగి రాజు పాదములందు పడునట్లు చేసెను.

అవ :- ఇట్లు ముందు శ్లోకమున విశేషించి, కటాక్షింపకపోయినను, సామాన్యముగా నైనను కటాక్షించిన చాలును- అని చెప్పగా, స్వామి ఇంకను ఇతడు కుపితుడైయున్నట్లు తోచుచున్నదే ! అని భయాక్రాంతుడై, "ఓయీ ! నీవు ఇట్లు సామాన్యముగా పలుకతగునా? "ఆజ్ఞప్తోऽహం తపస్వినామ్" అని, "అదు వమదు విదివక్కైయే" అనియు, మామిడిపండును అడుగగా అరటిపండును ఇచ్చువారివలె కాక, ఆశ్రితుల ఇచ్ఛానుగుణముగాకదా నేను చేయుదును ! నీ మనస్సు ఇట్టిదని తెలిపి నియమింపవలెనని వినీతుడై పలుకగా, దేశికులును ఇట్లు పరమకారుణికుడై, మహాప్రభువైన ఇతనినికదా నేను ఉదాసీనముగా పల్కితిని ! ఏమి చేయుదును ? అని అనుతప్తులై కోపము తీరినవారై తమ ఇష్టమును ఇట్టిదని ప్రకృతశ్లోకమున పలుకుచున్నారు.

భయం శమయ రంగధామ్న్యనితరాభిలాషస్పృశాం
శ్రియం బహుళయ ప్రభో ! శ్రితవిపక్ష మున్మూలయ ।
స్వయం సముదితం వపు స్తవ నిశామయంత స్సదా
వయం త్రిదశనిర్వృతిం భువి ముకుంద ! విందేమహి ॥ 20 ॥

ప్రభో = ప్రభూ !, త్వం = నీవు, రంగధామ్ని = శ్రీరంగమునందు, అనితర+అభిలాష స్పృశామ్ = కామాదిభోగములందు కోరికను లేనివారి (పరమైకాంతులయొక్క), భయం= భయమును, శమయ = నాశనము చేయుము, శ్రియం = (భాగవతసమృద్ధి అను) సంపదను, బహుళయ = పెంపొందింపుము, శ్రితవిపక్షమ్ = ఆశ్రితుల విరోధులను, ఉన్మూలయ = సమూలముగా నశింపచేయుము (పెకలించి వేయుము), ముకుంద = ముక్తిబుద్ధిని కల్గించు వాడా !, వయం = మేము, తవ = నీయొక్క, స్వయం సముదితం = స్వయంవ్యక్తమైన, వపుః = (శ్రీరంగశాయియైన) దివ్యమంగళవిగ్రహమును, సదా = ఎల్లప్పుడు, నిశామయంతః = సేవించుచు, భువి= భూలోకమునందు, త్రిదశ = నిత్యసూరుల, నిర్వృతిం = ఆనందమును, లభేమహి = పొందెదము.

ప్రభూ ! శ్రీరంగమున తురుష్కులవలన కల్గిన భయమును పోగొట్టవలయును. మంచిసంపద వృద్ధియగునట్లు చేయవలెను. ఆశ్రితుల విరోధిసమూహములను

సమూలముగా నాశనము చేయవలెను. ఇట్లు చేసిన మేము నీవే స్వయముగా ఆశపడి వేంచేసియున్న, శ్రీరంగశాయియైన దివ్యమంగళవిగ్రహమును ఎల్లప్పుడు సేవించుచు, ఈ భూలోకమునందే నిత్యసూరుల ఆనందమును పొందెదము.

ఉభయవిభూతికి ప్రభువగు నీవు ప్రయోజనాంతరరుచిని, దానిమూలముగా కల్గిన దేవతాంతరసంబంధము లేని పరమైకాంతులు నిత్యవాసము చేయునట్టి శ్రీరంగ క్షేత్రమున తురుష్కులు మొదలగువారివలన కల్గిన భయమును నివృత్తి చేయవలెను. భాగవతసమృద్ధిని అభివృద్ధి జేయవలెను. ఆశ్రితవిరోధులను సమూలముగా నిరసింప వలయును. ఇట్లు చేసినచో త్వదనుభవైకధారకపోషక భోగ్యులమగు మేము శ్రీవైకుంఠము కంటె అత్యాదరముతో వచ్చి అవతరించిన నీ దివ్యమంగళవిగ్రహమును కన్నులతో నిత్యసూరులవలె సేవించుచు మోక్షసామ్రాజ్యమునందున్న మహానందమును ఇచటే అనుభవింతుము.

(ప్రభో) - ఉభయవిభూతినాయకా!- అని భావము. ప్రభుపదప్రయోగముచే "శమయే"త్యాదులు విధ్యర్థకములు కాదు, ప్రార్థనార్థములోని లోట్‌రూపములు. ప్రభువును విధింపరాదుకదా !

(అనితరాభిలాషస్పృశామ్) -"ఇతరేషు కామభోగేషు అభిలాషం స్పృశంతీతి ఇతరాభిలాష స్పృశః, ప్రయోజనాంతరపరా ఇతి యావత్. తే న భవంతి అని తరాభిలాషస్పృశః, తేషామ్" అని విగ్రహము. పరమైకాంతులని తాత్పర్యము.

(రంగధామ్ని భయం శమయ) - ఆర్యావర్తాదిపుణ్యక్షేత్రములు ఇపుడు యుగ స్వభావముచే వ్యాకులమైయుండుటచే వసింప వీలగునవికావు. "అత్రైవ శ్రీరంగే సుఖ మాస్వ" అని నీవు నియమించిన క్షేత్రమునందును యవనాదులచే భయము ఏర్పడుటచే, దానిని ప్రభువగు నీవే నివృత్తి చేయవలయును ప్రార్థించుచున్నారని భావము.

(శ్రియం బహుళయ) - భాగవతసమృద్ధిని అభివృద్ధిపఱుపవలయును. (లేక) శ్రియమ్ - అన్నపానాదులకు యోగ్యమైన సంపదను, బహుళయ- "యే చేమే కఠకాలాపాః , బహవోదండమాణవాః, నిత్యస్వాధ్యాయశీలత్వాత్ నాన్యత్ కుర్వంతి కించన, అలసాః స్వాదుశీలా శ్చ మహతాం చాపి సమ్మతాః, తేషా మశీతియానాని రత్నపూర్ణాని దాపయ" అని స్వాధ్యాయశీలురగు కఠకాలాపాదులకు సంపదను ఇచ్చినట్లు, శ్రీరంగమున వేదాంతపఠనాదికైంకర్యపరులకు "శరీరారోగ్య మర్థాం శ్చ భోగాం శ్చైవానుషంగికాన్, దదాతి ధ్యాయినాం నిత్య మపవర్గప్రదో హరిః" అనునట్లు, శరీరధారణాదులకు

సాధనమగు సంపదను ఇవ్వవలయుననియు తాత్పర్యము. దేశికులు ఆళ్వార్లవలె పరసమృద్ధ్యైక ప్రయోజనులగుటచే స్వాభీష్టమును ప్రార్థించుటకు ముందు ఇతరుల సంపదకొఱకు ప్రార్థించుచున్నారని భావము.

(శ్రితవిపక్ష మున్మూలయ) - ఆశ్రితవిరోధులను సమూలముగా నివృత్తిచేయ వలయును. మూలము మిగిలియున్నచో ఎపుడైన వారివలన పీడ కలుగవచ్చును. కావున సమూలముగా నాశనము చేయవలయునని భావము.

(స్వయం సముదితమ్) - స్వయముగానే ఆవిర్భవించిన. "రాజ్ఞో దశరథస్య త్వ మయోధ్యాతిపతేః ప్రభోః, విష్ణో పుత్రత్వ మాగచ్ఛ" అను దేవతల నియమనముచే అయోధ్యలో చక్రవర్తికి కుమారుడై అవతరించినట్లుకాక, స్వయముగానే ఆశపడి అవతరించెనని భావము. "సముదితమ్" అనునపుడు "సమ్" ఉపసర్గచే పరమపదము లోవలె దేవీభూషణాయుధపరికరములతోకూడ అవతరించెనని ఏర్పడుచున్నది.

(ముకుంద) -మోక్షదాయకా!

(తే వపుః సదా నిశామయంతః) - నీ దివ్యమంగళవిగ్రహమును. "న సందృశే తిష్ఠతి రూప మస్య" అని నేత్రాగోచరమైన వస్తువుకదా సదా నేత్రవిషయమగు చున్నది- అని ఎల్లప్పుడు సేవించుచు.

(త్రిదశనిర్వృతిమ్) - దేవతల సుఖమును. దేవతలు అనిమిషులగుటచే సదా కన్నులతో చూచునట్లు మేమును అనిమిషులమై దర్శించుచు ఆనందమును పొందెదము- అని భావము. (లేక) త్రిదశపదము నిత్యసూరిపరము. "సదా పశ్యంతి సూరయః" అని నిత్యసూరులవలె సదా దివ్యమంగళవిగ్రహమును సేవించునట్టి సుఖమును.

(భువి లభేమహి) - భూమియందు పొందెదము. మోక్షప్రదుడవగు నీవు మోక్షదశలో ఇచ్చు ఆనందమును ఇచటనే ప్రసాదింపగా అనుభవింతుము- అని తాత్పర్యము.

అవ :- ఓయీ ! నీ ఇష్టము ఇట్టిదని చెప్పుమనగా దానిని తెలుపక "అనితరాభిలాషస్పృశాం శ్రియం బహుళయ" అనుచు ఇతరులకు సంపదను అనుగ్రహింపవలయునని, భయనివృత్తిని చేయవలయునని ప్రార్థింపనగునా ? వారు ఉపాయానుష్ఠానము చేసినకదా వారికి భయనివృత్తి మొదలగువానిని కలుగచేయుట. - అనగా, శ్రియఃపతివై, ఆశ్రితజనసంరక్షకుడవై, అఖిలహేయప్రత్యనీకుడవై, అనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణమహోదధివై, అనాలోచితవిశేషాశేషలోక శరణ్యుడవై శ్రీరంగమున అభిముఖుడవైయున్న నిన్ను అనన్యశరణుడను, దాసుడనగు

నేను "కడల్ వణ్ణన్ పూతజ్గళ్ మణ్మేల్ మలియ ప్పుకున్దు ఇశైపాడి యాడి యుళితర క్కణ్డోమ్, కణ్డోమ్ కణ్డోమ్ కణ్డోమ్ కణ్ణుక్కినియవ కణ్డోమ్" అని పల్కురీతిలో భాగవతులందరు ఈ లోకమున సమృద్ధిని పొందవలయునను భావమున లక్ష్మీదేవి పురుషకారపూర్వకముగా శరణు వేడితిని- అను దానిని ఒక వ్యాజముగా గొని ఆశ్రిత విరోధినిరసన త్వరతో అగ్నిని కక్కుచున్న చక్రాద్యాయుధములతో నిరుపాధికమైన ప్రభుత్వమును క్షణకాలముకూడ విడువక నిర్వహించినచో విరోధులు తమకు తామే నశించును. నీకు శస్త్రమును ఎత్తి ప్రయోగించి, యుద్ధమును చేయవలసిన శ్రమయు అవసరము లేదు- అను అభిప్రాయముతో ఈ శ్లోకమును దేశికులు పల్కుచున్నారు.

శ్రియః పరిబృఢే త్వయి శ్రితజనస్య సంరక్షకే
సదద్భుతగుణోదధౌ విత్తి సమర్పితోఽయంజనః ।
ప్రతిక్షణ మతః పరం ప్రథయ రంగధామాదిషు
ప్రభుత్వ మనుపాధికం ప్రథితహేతిభిః హేతిభిః ॥ 21 ॥

శ్రియః = లక్ష్మీదేవికి, పరిబృఢే = పతివగు, శ్రితజనస్య = ఆశ్రితజనులకు, రక్షకే = రక్షకుడవగు, సత్+అద్భుత+గుణ+ఉదధౌ = మంచివి, అద్భుతములైనవి అగు గుణములకు సముద్రమువంటివాడవగు, త్వయి = నీయందు, అయం జనః = ఈ జనుడు (నేను), సమర్పితః= సమర్పింపబడినవాడు, అతః పరం = ఇకపైన, ప్రతిక్షణం= ప్రతిక్షణము, ప్రథితహేతిభిః = వృద్ధిచెందుచున్న జ్వాలలను కల, హేతిభిః = ఆయుధములచే, అనుపాధికం = స్వతస్సిద్ధమైన, ప్రభుత్వం = ప్రభువుగానుండుటను, రంగధామ+ఆదిషు =శ్రీరంగము మొదలగు దివ్యదేశములలో, ప్రథయ = ప్రకాశింప జేయుము.

శ్రియఃపతివై, ఆశ్రితులను రక్షించువాడవైయున్న నీయందు ఈచేతనుడు రక్షత్వేన సమర్పింపబడినవాడు. ఇకపై, నీవు వృద్ధియగుచున్న జ్వాలలను కల ఆయుధములచే స్వభావసిద్ధమగు ప్రభుత్వమును శ్రీరంగము మొదలగు దివ్యక్షేత్రము లలో ప్రతిక్షణము ప్రకాశించునట్లు చేయుము.

(శ్రియఃపరిబృఢే) - లక్ష్మీదేవికి వల్లభుడవైన నీవు. దీనివలన "శృణోతి, శ్రావయతి" అను వ్యుత్పత్తి సిద్ధమైన పురుషకారభావమును చెప్పుటతోపాటు శ్రీవిశిష్టుడే ప్రపత్తవ్యుడని తెలుపబడినది. ఈ అర్థమును శ్రీమద్రహస్యత్రయసారములోని ద్వయాధికారమున శ్రీమచ్ఛబ్దార్థవ్యాఖ్యానములో చూడనగును.

(శ్రితజనస్య సంరక్షకే) - శ్రితజనులకు చక్కగా రక్షకుడవైన. ఇచటి 'సం' అను ఉపసర్గచే మహావిశ్వాసమును, "రక్షకే" అను పదముచే గోప్తృత్వవరణమును సూచితములు. ఎట్లనగా - సమ్యక్‌రక్షకత్వమనగా ఉపాయాంతరస్థానాపన్నత్వపూర్వక రక్షకత్వము. భక్తప్రపన్నసాధారణగోప్తృత్వవరణము రక్షకపదముచే, ప్రపన్నైకాంతమైన ఉపాయాంతరస్థానాపన్నత్వాధ్యవసాయ రూపమహావిశ్వాసము "సం" అను ఉపసర్గచే తెలుపబడినది అని గమనింపనగును.

(సదద్భుతగుణోదధౌ) - సత్-శ్రేష్ఠములైన, అద్భుత- ఆశ్చర్యకరములైన, గుణములకు సముద్రుడవగు- అని అర్థము. మహాపాపులను సైతము వారు తలచునపుడు నిత్యసూరిపరిషత్తులో అర్హులగునట్లు చేయునట్టి ఆశ్చర్యదివ్యగుణములకు సముద్రుడవై యుందువని భావము. ఇందుచే ప్రపత్త్యనుష్ఠానకాలమున అనుసంధేయము లగు వాత్సల్యస్వామిత్వాది పంద్రెండుగుణములును, తత్ప్రతిపాదక నారాయణశబ్దమును సంగృహీతము. స్వామిత్వరూపగుణానుసంధానమును చేయగా ఆనుకూల్యసంకల్ప ప్రాతికూల్యవర్జనములును సంగృహీతములు.

(త్వయి) - నీయందు. "త్వయి" అనుచు విగ్రహవిశిష్టుడైన అభిముఖుడు తెలుపబడుటచే చరణశబ్దార్థము సూచింపబడినది. చరణశబ్దమునకు చరణోపలక్షిత దివ్యమంగళవిగ్రహవిశిష్టస్వరూపము అర్థ మనుట శ్రీమద్రహస్యత్రయ సారమునందు గమనింపతగినది.

(అయం జనః) కృపణుడగు ఈ చేతనుడు.

(సమర్పితః) - "సమ్యక్ అర్పితః". నీయందు భరత్వేన అర్పింపబడినవాడు. 'సం' అను ఉపసర్గ స్వనిర్భరత్వపర్యంతార్థకము. కావున నాకు ఎట్టి భయము లేకుండునట్లు నీకే భరముగా గ్రహింపనగునని ఈదాసుడు అర్పింపబడినాడని అర్థము. "అయం జనః" అనుటచే ఉత్తమపురుషచే తెలుపబడిన కార్పణ్యము సూచితము.

(ఇతి) - అని తలచి. శరణాగతి చేసితిననునది హేతువుగా గ్రహించి అని అర్థము.

(అతః పరమ్) - నేను చేసిన ప్రపత్త్యనుష్ఠానమునుండి.

(ప్రథితహేతిభిః) - అభివృద్ధమైన జ్వాలనుకల. ఈ విశేషణముచే ఆశ్రితవిరోధినిరసనమువలన త్వరతో కూడియుండుట సూచితము.

(హేతిభిః) - చక్రాద్యాయుధములచే

(అనుపాధికం ప్రభుత్వమ్) - నిరుపాధికమైన ప్రభావమును. సుకృతవిశేషముచే సంపాదింపబడిన ఇంద్రాదుల ప్రభావమువలెకాక స్వాభావికముగానుండుట నీకు ప్రభావమని అర్థము. ఆ ప్రభావమును ప్రకటింపవలెనని కోరుచున్నారు.

(ప్రతిక్షణమ్)- క్షణముకూడ విచ్ఛేదము లేక.

(రంగధామాధిప) - శ్రీరంగాదిక్షేత్రములలో శ్రీరంగమువలె సర్వజగత్తును తురుష్కాదులు వ్యాపరించియున్నారని తాత్పర్యము.

(ప్రథయ) ప్రకటింపవలెను. "తస్య క్రుద్ధస్య రూపం చ రామస్య దదృశే తదా, ఆవిష్టం తేజసా రామం సంగ్రామశిరసి స్థితమ్, దృష్ట్వా సర్వాణి భూతాని భయార్తాని ప్రదుద్రువుః"అనునట్లు నీవు సర్వాయుధోపేతుడవై ప్రభుత్వమును చేయగా, విరోధులందఱు తమకు తామే నశింతురు- అని భావము. శస్త్రము నెత్తి యుద్ధమును చేయు శ్రమయు అక్కఱలేదు. త్వదనుభవవిరోధియగు విషయవర్గమును సవాసనగా నివృత్తిచేసి, పరమపదమునకు పోవుటకు మనస్సు లేకున్నను, తురుష్కయవనాదుల వలనకల్గిన భయమునైనను నివృత్తి చేసి, భాగవతసమృద్ధిని కల్గించినచో, వారిని అవలంబనముగా గొని శ్రీరంగమునందు అభిముఖుడవైయున్న నిన్ను, గోపికలు పలువురు కలసి బృందావనములో అనుభవించినట్లు అనుభవింతునని తాత్పర్యము.

అవః- ముందుశ్లోకమున - "భయం శమయ" అని సామాన్యముగా పల్కినదానిని "తురుష్కయవనాదిభిః జగతి జృంభమాణం భయమ్ క్షపయ" అని ఇందు విశేషించి పల్కుచున్నారు. "భయం రంగధామ్ని" అని శ్రీరంగమును నిర్దేశించుట జగత్తునకంతటికి ఉపలక్షణమను భావముతో ఈ శ్లోకమున -"జగతి"అని పల్కిరి. మఱియు సంకల్పమాత్రములచే విరోధినిరసనమును చేయకుండ విరాధప్రభృతి రావణపర్యంతమైన రాక్షసులను ఆయుధమును గ్రహించి వచ్చి నిరసించినట్లు, చక్రాద్యాయుధములను గొని వచ్చి యవనాదినిరసనమును చేయవలయును అనుచున్నారు.

కలిప్రణిధిలక్షణైః కలితశాక్యలోకాయతైః
తురుష్కయవనాదిభిః జగతి జృంభమాణం భయమ్ ।
ప్రకృష్టనిజశక్తిభిః ప్రసభ మాయుధైః పంచభిః
క్షితిత్రిదశరక్షకైః క్షపయ రంగనాథ క్షణాత్ ॥ 22 ॥

రంగనాథ = శ్రీరంగనాథ !, కవిప్రణిధిలక్షణైః = కలిమహారాజుకు పరిజనమువంటి

వారిచే, కలితశాక్యలోకాయతైః = చేరియున్న శాక్యులు, చార్వాకులు అను వీరితోపాటు, తురుష్కయవనాదిభిః = తురుష్కులచే, యవనులు మొదలగువారిచే, జగతి = లోకమునందు, జృంభమాణం = సమృద్ధి చెందుచున్న, భయం = భయమును, ప్రకృష్టనిజశక్తిభిః = గొప్పదైన తమ శక్తిని కల్గినవగు, క్షితిత్రిదశరక్షకైః = భూసురులను రక్షించు, పంచభిః = అయిదు, ఆయుధైః = ఆయుధములచే, ప్రసభం = బలాత్కారముగా, క్షణాత్ = క్షణములో, క్షపయ = నశింపచేయుము.

శ్రీరంగనాథా! కలిపురుషుని పరిజనములవంటివారగు నాస్తికవాదులు, మొదలగువారితోకూడియున్న తురుష్క, యవనాదులచే లోకమున వృద్ధిపొందింపబడిన భయమును ఒకసారి అయినను, ఒకసమయమునందైన, ఒకచోట అయినను వ్యర్థము కాని శక్తినికల, భూసురరక్షకములగు నీ అయిదు ఆయుధములతో శీఘ్రముగా నశింపజేయుము.

(కలిప్రణిధిలక్షణైః) - కలికి గూఢచారుల లక్షణమును కలవారిచే. మృషావాది ప్రభృతులు వేదబాహ్యులగు శాక్య-ఉలుకాదులవలెకాక వైదికవేషమును దాల్చి,సాధుగోష్ఠిలో ప్రవేశించి, అనవధికములైన కుహనాయుక్తులను పల్కి భ్రమింపచేయుటచే గూఢచారు లనుచు మృషావాది ప్రభృతులను పల్కిరి. శుకసారణులు వానరవేషమును దాల్చి ప్రచ్ఛన్నులై వానరగోష్ఠిలో ప్రవేశించినట్లు, వీరు వైదికవేషమును ధరించి సాధుగోష్ఠిలో ప్రవేశించిరని అర్థము. వీరి కుతర్కములచే సాధువులందఱు భయపడుచున్నారనును "వాదియర్ మన్ను తరుక్కచ్చెరుక్కిల్ మఱైకులైయ చ్చాదు జనజ్గళడజ్గవడుజ్గ" అనుచు దేశికులే పల్కిరి.

(కలితశాక్యలోకాయతైః) - "కలితాః సంవలితాః, శాక్యాః లోకాయతికా శ్చ తైః". ఇది ఉలూక- క్షపణకాదులకును ఉపలక్షణము శాక్య-ఉలూక్య- అక్షపాద- క్షపణక- భిక్షు- చార్వా-కాదులందరు సంఘీభూతులై, కుతర్కములతో వేదములను దూషించి, అపసిద్ధాంతములను చేయుచు, వైదికులు భయపడునట్లు చేయుదురు. "శ్వావరాహకలహక్రమక్రమీ"- అని శునకములు, పందులు పరస్పరము ఆగ్రహముతో కలహించునపుడు ఒక వరాహమువచ్చినచో ఆ కుక్కలన్నియు కలసి వరాహముపై పడునట్లు వేదబాహ్యులు పరస్పరము దూషించుకొనుచు వైదికులవద్దకు అందఱు కలసి వచ్చి, వారిపై దండెత్తుదురని భావము.

(తురుష్కయవనాదిభిః) - ఆదిశబ్దముచే హూణ-పుళింద- శకాదులు ఉపలక్షింపబడిరి. ఇట్లు శాక్యోలూక్యాదులచే సిద్ధాంతము వ్యాకులితమై, సాధువులకు

భయము కల్గుటయే గాక, తురుష్కాదులు "భక్ష్యంతే రాక్షసై ర్భీమై ర్నరమాంసోపజీవిభిః" అని రాక్షసులు ఋషుల శరీరములను కఱచుట, భక్షించుటయును చేయునట్లు, సాధువుల ప్రాణశరీరములగు (వేదములను) కొట్టుట, కఱచుటయు చేయుచున్నారని భావము. ఒకదేశమందు భయము కల్గినచో వేఱొక దేశమునందు ఒదిగి, నివసింపవచ్చునుకదా!- అనినచో, అందులకు సమాధానముగా.

(జగతి జృంభమాణం భయమ్) - అనుచున్నారు. జగమంతయు విస్తరించి యుండి మహాభయము అభివృద్ధమగునట్లు చేయుచున్నారు. ఇట్లు సాధువులకు శరీరహానిపర్యంతమైన మహాభయము వచ్చినపుడును వారు "ఏహి పశ్య శరీరాణి" అని ఋషులు,రాక్షసులు భక్షించిన శరీరములను చూపి, నిన్ను ప్రార్థించినట్లు ప్రార్థించుటకును శక్తిలేక పడియుండి దుఃఖించుచున్నారు. ఇట్టి దశలో కూడ ఉపేక్షింపనగునా? ఆయుధములను గ్రహించి నీ ప్రభుత్వమును నిలుపుకొనుము -అనుచు ఉత్తరార్ధమున తెలుపుచున్నారు.

(ప్రకృష్టనిజశక్తిభిః) - ఇది ఆయుధమునకు విశేషము. అధికమగు తమసామర్థ్యమును కల్గినవగు, ఆయుధములు నీకు శత్రువినాశముకొఱకు లేవా? ప్రకృష్టమైన శక్తినికల అనేక ఆయుధములను కలవాడవుకదా ! అని భావము. "స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్" అనునట్లు శంఖధ్వానముకూడ శత్రువులను సంహరించునదికదా !

(క్షితిత్రిదశరక్షకైః) - బ్రాహ్మణులను రక్షించునవి అగు- అని భావము. "క్షితిత్రిదశాః భూసురాః బ్రాహ్మణా ఇత్యర్థః". "బ్రాహ్మణేభ్యో విశేషతః" అని నీవు బ్రాహ్మణులపట్ల విశేషపక్షపాతమును కల్గియున్నట్లే ఆయుధములును విశేషముగా బ్రాహ్మణ రక్షకులైయున్నవని భావము.

(పంచభి రాయుధైః) - ఒకటికాక అయిదు ఆయుధములుండగా, ఆయుధము లేనివానివలె యుండతగునా?

(క్షణాత్ ప్రసభం క్షపయ) - క్షణములో బలాత్కారముగా నాశనమును చేయవలయును. మఱునాడు చేసెదనని అన్నచో అంతలోగా సాధువులు నశింతురు సుమా! వారు నశించుటకు ముందు వేగముగా వచ్చి విరోధినిరసనమును చేయవలెను. నిన్ను చూచి శత్రువులు భయపడి పారిపోవుదురు, పారిపోయినను, పరహింసను చేయు వ్యాఘ్రాదులను తఱుముచు వధించునట్లు, బలాత్కారముగా అవైదికులగు తురుష్క

లను శిక్షింపనగును- అని ఘట్టార్థము. "క్షితిత్రిదశరక్షకైః" అని పల్కుటచే తురుష్కులు బ్రాహ్మణులను హింసించుచున్నారనియు సూచింపబడినది.

అవ :- పంచాయుధములు ఆవశ్యకములా ! శ్రీసుదర్శనము ఒక్కటియే సర్వవిరోధినిరసనమును చేసి, ధర్మప్రవర్తనమును చేయుటకు చాలదా? అను అభిసంధితో శ్రీసుదర్శనుని ప్రార్థించుచున్నారు.

దితిప్రభవదేహభి ద్దహనసోమసూర్యాత్మకమ్
తమఃప్రమథనం ప్రభో సముదితాస్త్రబృందం స్వతః ।
స్వవృత్తివశవర్తితత్రిదశవృత్తి చక్రం పునః
ప్రవర్తయతు ధామ్ని తే మహతి ధర్మచక్రస్థితమ్ ॥ 23 ॥

దితిప్రభవ = అసురుల, దేహభిత్ = శరీరమును బద్దలు చేయునది, దహన =: అగ్ని, సోమ = చంద్రుడు, సూర్యాత్మకం = సూర్యుడు అను వీరి స్వరూపమును కల్గినది, తమఃప్రమథనం = చీకటిని నశింపచేయునది, సముదిత+అస్త్ర బృందం = (తనయందు) చేరియున్న అనేక ఆయుధములను కల్గినది, స్వవృత్తివశవర్తిత = తన ప్రవృత్తిచే, వశీకరింపబడిన, త్రిదశవృత్తి = దేవతల వ్యాపారమును కల్గినది అగు, తే= నీయొక్క, చక్రం = శ్రీసుదర్శనచక్రము, స్వతః = తానే, మహతి ధామ్ని = గొప్ప దేశమగు శ్రీరంగమునందు, ధర్మచక్రస్థితమ్ = ధర్మచక్రముండుటను, ప్రవర్తయతు= ప్రవర్తింపచేయునుగాక !

అసురనాశకమైనది, సూర్యచంద్రాగ్నులవంటిది, అజ్ఞానాంధకారమును పోగొట్టునది, తమకు తామే వచ్చి చేరియున్న అనేకాయుధములను కల్గినది, తన అధీనమైన దేవతల స్థితిప్రవృత్తులను కల్గినది అగు నీ చక్రాయుధము శ్రీరంగము మొదలగు దివ్యదేశములందు నివృత్తిధర్మము స్థిరముగా నుండునట్లు చేయునుగాక!

(దితిప్రభవదేహభృత్) - అసురశరీరభేదకము. "సురద్విషాం ప్రాణవినాశి విష్ణోశ్చక్రమ్" అనునట్లు అసురశరీరభేదకమైన చక్రమునకు తురుష్కాదినిరసనము ఒక లెక్కయా ! అని అర్థము. విరోధులు భయపడి పరుగెత్తినను అంబరీషమహారాజుపట్ల అపరాధముచేసిన దుర్వాసమహర్షి పారిపోయినను, అతనిని తటిమి నిగ్రహించినట్లు, నిగ్రహింప సమర్థమని భావము.

(దహనసోమసూర్యాత్మకమ్) - అగ్ని - చంద్ర-సూర్యస్వరూపమైన. "అడలాళి" అని, "సుదర్శనమహాజ్వాల" అని చెప్పబడినట్లు శత్రువులను దహించు విషయమునందు

అగ్నియైయుండును. అట్లయినను, ఆశ్రితుల విషయమునందు చంద్రునివలె శీతలస్వభావమై యుండును. రుద్రసృష్టయైన కృత్యద్వారకలో శ్రీకృష్ణుడున్నప్పుడు ద్వారకను నాశనము చేయుటకు రాగా, కృష్ణుడు అపుడు "విజ్ఞాయ తద్విఘాతార్థం పార్శ్వస్థం చక్ర మాదిశత్" అని సుదర్శనమును నియమింపగా, "తం సూర్యకోటిప్రతిమం సుదర్శనం జాజ్జ్వల్యమానం ప్రళయానలోపమమ్" అనునట్లు అగ్నివలె, సూర్యునివలె దహించి, "దగ్ధ్వా వారాణసీం సర్వాం విష్ణుచక్రం సుదర్శనమ్" అని రుద్రస్థానమును దహించుటచే, ఆకాలమున ఆశ్రితులకు ఆహ్లాదకరమైయుండుటచే "దహన సోమసూర్యాత్మకమ్" అనిరి. అరాక్షసాస్త్రప్రయోగము చేసిన విరోధులు తపించునట్లు, ఆశ్రితులును తపించినచో ఏమి చేయుదును ? అని శంకింపవలదు. ఆశ్రితులకు చల్లనిదై, ఆహ్లాదకరమైయుండును- అని తాత్పర్యము. దహన-సోమ-సూర్యులు తమకు ప్రకాశకత్వము ఉండుటచే బాహ్యమైన తమస్సును నశింపచేయుదురు. ఆంతరమైన అజ్ఞానాంధకారమును వారు నిరసింపలేరు. కాని, సుదర్శనము ఆంతరమైన అజ్ఞానాంధకారమునుకూడ నిరసించును- అను అభిప్రాయముతో పల్కుచున్నారు.

(తమఃప్రమథనమ్) - అంధకారమును పోగొట్టు. అజ్ఞానాంధకారమును పోగొట్టు- అని భావము. చక్రమునకు అగ్ని మొదలగువానికివలె దాహకత్వగుణ ముండుటనుబట్టి విరోధినివర్తకత్వము, ప్రకాశకత్వముండుటనుబట్టి తమో నివర్తకత్వమును ఉండుటచే, "దహనసోమసూర్యాత్మకమ్" అనునది హేతుగర్భవిశేషణము అని గ్రహింపనగును. "అజ్ఞానాంధకారస్య విష్ణో ర్మార్గం ప్రవర్తయ" అని సుదర్శనుడును అజ్ఞానాంధకారనివర్తకుడై యుండునుకదా ! అయినను అనేక ఆయుధములచే సాధింపవలసిన అర్థమును ఒకనిచే సాధింప సాధ్యమా? అనినచో-

(సముద్రితాస్త్రబృందం స్వతః)- స్వతస్సిద్ధముగానే సంపన్నములైన అస్త్రసమూహమును కల్గినది. "అస్త్రగ్రామస్య కృత్స్నస్య ప్రసూతిం యః ప్రచక్షతే, సోఽవ్యాత్ సుదర్శనః" అనునట్లు సర్వాయుధములకు సుదర్శనము ఉత్పత్తి స్థానముకదా! కావున సర్వాయుధములు సుదర్శనమందు సంపన్నములై యుండునని భావము. ఇట్లు అసురప్రభృతులను నిరసించినను, పారమైకాంత్యధర్మప్రవృత్తికి దేవతలచే విఘ్నము వచ్చినచో ఎట్లు? - అనినచో, వారును సుదర్శనమునకు అధీనులై యుందురు. కావున పారమైకాంత్యప్రవర్తనమునకు విరోధము లేదను అభిప్రాయముతో పిమ్మట పల్కుచున్నారు.

(స్వవృత్తివశవర్తితత్రిదశవృత్తి) - తన వ్యాపారమునకు స్వాధీనముగా

చేయబడిన దేవతల జీవనమును కల్గిన. దేవతల జీవనము చక్రాయత్తమగుటచే వారివలన విఘ్నము వచ్చినచో, వానిని తీర్చి పారమైకాంత్యప్రవర్తనమును చేయునని తాత్పర్యము.

**(తే చక్రమ్)** - నీ చక్రాయుధము. వ్యర్థమైన పౌండ్రకవాసుదేవుని చక్రమువలెకాక జయద్రథయుద్ధమున భాస్వరాచ్ఛాదనమును చేసి, పగలును రాత్రి చేసిన సామర్థ్యమునుకల నీ చక్రము- ఇత్యాది భావము 'తే' అను సర్వనామశబ్దముచే స్ఫురించును.

**(ధర్మచక్రస్థితమ్)** - నివృత్తిధర్మస్థితిని.

**(మహతి ధామ్ని)** - శ్రీరంగాదిక్షేత్రములలో

**(పునః ప్రవర్తయతు)** - మఱల ప్రవర్తింపచేయవలెను. పాషండాక్రాంతమగుటకు ముందు ఎట్లుండెనో అట్లే మరల ఉండవలెనని ప్రార్థించుచున్నారు.

అవ :- ముందుశ్లోకమున నీకు అనేక ఆయుధములు కావలయునా ? సుదర్శనము ఒక్కడే చాలదా ? అని పల్కిరి. ఆ సుదర్శనముకూడ నీకు అవసరమా? "తృణస్యైవాస్త్రత్వమ్" అనునట్లు తృణమును అస్త్రముగా చేసిన నీ శక్తిని గొని విరోధినిరసనమును చేయరాదా ? అను అభిప్రాయముతో దేశికులు ప్రస్తుతశ్లోకమును పల్కుచున్నారు.

**మనుప్రభృతిమానితే మహతి రంగధామాదికే**
**దనుప్రభవదారుణైః దర ముదీర్యమాణం పరైః ।**
**ప్రకృష్టగుణకశ్రియా వసుధయా చ సంధుక్షితైః**
**ప్రయుక్తకరుణోదధే ప్రశమయ స్వశక్త్యా స్వయమ్ ॥ 24 ॥**

మనుప్రభృతి = మనువు మొదలగువారిచే, మానితే = పూజింపబడినవి, మహతి = గొప్పది అగు, రంగధామ+ఆదికే = శ్రీరంగము మొదలగు క్షేత్రములలో, దనుప్రభవదారుణైః = అసురులవలె క్రూరులైన, పరైః = ఇతరులచే, ఉదీర్యమాణం = ఉద్భవించుచున్న, దరం = భయమును, ప్రయుక్తకరుణ+ఉదధే = వినియోగింపబడిన కరుణాసముద్రమునుకలవాడా !, త్వం = నీవు, ప్రకృష్ట = గొప్పదైన, గుణక = గుణమును కల్గిన, శ్రియా = లక్ష్మీదేవిచే, వసుధయా చ = భూదేవిచేతను, సంధుక్షితః= వృద్ధిపఱుపబడినదగు, స్వశక్త్యా = నీ శక్తిచే, స్వయం = స్వయముగా, ప్రశమయ = నాశనమును చేయుము.

మనువు మొదలగువారిచే పూజింపబడినదగు శ్రీరంగము మొదలగు క్షేత్రములలో అసురులవంటి తురుష్కులు మొదలగువారిచే ఏర్పడిన భయమును నీవు లక్ష్మీదేవి, భూదేవి మొదలగు దేవేరులచే విజ్ఞాపనము చేయబడినవాడవై నీ సంకల్ప బలముతోనే పోగొట్టుము.

(మనుప్రభృతిమానితే) - "మనుముత్తైయిల్ వరువదోర్ విమానత్తుత్తైన్దన" అనునట్లు మను -ఇక్ష్వాకుప్రభృతులచే పూజింపబడినదని అర్థము. అందువలననే,

(మహతి)- గొప్పదగు.

(రంగధామాదికే) - శ్రీరంగాదిక్షేత్రములందు. ఇందువలన మనువు, ఇక్ష్వాకులకు పరంపరగావచ్చిన శ్రీరంగనాథుని శ్రీరాముడు మందిరముతో పాటుగా విభీషణునకు ఇచ్చెను- అని సూచింపబడినది. ఇచట "రంగధామాదికే" అని ఆదిపదముచే మిగిలిన పుణ్యక్షేత్రములును సూచింపబడినవి. అట్లే, "మనుప్రభృతి" మార్కండేయాదికమగు తత్తత్క్షేత్రములందున్న మునిజనముచే పూజితమని తాత్పర్యము.

(దనుప్రభవదారుణైః) - అసురులకంటె క్రూరులైన. పంచమీతత్పురుష సమాస మిచట వివక్షితము.

(పరై రుదీర్యమాణం దరమ్) - తురుష్కులు మొదలగువారివలన కల్గిన భయమును.

(ప్రయుక్తకరుణోదధే) - ప్రాణివర్గమునందు వినియోగించిన దయకు సముద్రమవైయున్నవాడా ! దయ పూర్ణముగానుండగా నిర్దయుడవువలె నీవు ఉదాసీనుడవైయుండనగునా ?

(ప్రకృష్టగుణకశ్రియా) - ప్రకృష్ట- ఉత్కృష్టమైన, వాత్సల్యాదిగుణములను కల్గిన, శ్రియా = లక్ష్మీదేవిచే- అని అర్థము. ఇచటి ప్రకృష్టత్వము "అజ్ఞాతనిగ్రహామ్" అనునట్లు నిగ్రహసంకల్పము కలసియుండకపోవుట. నిగ్రహసంకల్పముతో కూడియుండని దయాదిగుణములను కల్గినది- అని భావము. "ప్రాణై రపి త్వయా నిత్యం సంరక్ష్యః శరణాగతః" అని ప్రాణమును విడచియైనను, శరణాగతుని రక్షింపవలెనని భర్తతో పల్కునట్టి వాత్సల్యమును కల్గిన లక్ష్మీదేవిచే- అని తాత్పర్యము.

(వసుధయా చ) - భూదేవిచే. "పాశిత్తూత్తి క్కిడన్ద పార్మకళుక్కు పణ్డొరునాళ్"

అని ప్రణయార్ణవమగ్నయై పాచితో కూడుకొన్న శరీరమును కల్గిన భూదేవి తనకు క్లేశము ఉన్నను "అహం శిష్యా చ దాసీ చ భక్తా చ త్వయి మాధవ, మత్కృతే సర్వభూతానాం లఘూపాయం వద ప్రభో" అని సంసారార్ణవమగ్నులై, కర్మయోగాది రూపానుష్ఠానమును చేయ శక్తిలేక తడబడు ప్రాణుల క్లేశమును చూచి, నా నిమిత్తము లఘూపాయమును అనుగ్రహింపవలయునని ప్రార్థించు వాత్సల్యమును కల్గిన భూదేవిచే- అని తాత్పర్యము.

(సంధుక్షితః) - వృద్ధిచేయబడిన (ప్రోత్సహింపబడిన).

(త్వం) - నీవు ఆదిశేషునిపై నిద్రించు నీవు- అని అర్థము. "సమయా బోధితః శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః" అనునట్లు దేవేరులచే ప్రోత్సహింపబడిన, పరంతపుడవగు నీవు "సదర్భం సంస్తరాత్ గృహ్య బ్రహ్మాస్త్రేణ నియోజయత్" అని దర్భను బ్రహ్మాస్త్రముగా చేసిన తన శక్తిని గొని, ఆయుధమును అపేక్షింపనివాడవై భయమును పోగొట్టవలయునని తాత్పర్యము. "త్వం సంధుక్షితస్సన్ పరై రుదీర్యమాణం దరం స్వశక్త్యా స్వయం ప్రశమయ" అని అన్వయము. ఆయుధము లేకుండనే ఉపశమింపచేయుమని భావము. శ్రీరంగనాథుడు శయనించియుండి నిద్రించునపుడు దేవేరులు నిద్రలేకుండ రెండు పక్కలయందు ఆశ్రితునకు కీడు కల్గునపుడు నిద్రలేపుటకొఱకే ఉన్నారని భావము.

అవ :- ఇకపై ఇట్టి భయములేకుండ యుండునట్లు నీవు పరిజనములను ఆజ్ఞాపించవలెనని ప్రార్థించుచున్నారు.

భుజంగమవిహంగమప్రవరసైన్యనాథాః ప్రభో
తథైవ కుముదాదయో నగరగోపురద్వారపాః ।
అచింత్యబలవిక్రమా స్త్వ మివ రంగసంరక్షకాః
జితంత ఇతి వాదినో జగదనుగ్రహేజాగ్రతు ॥ 25 ॥

ప్రభో= ప్రభూ!, భుజంగమ (ప్రవర) = ఆదిశేషుడు, విహంగమప్రవర = గరుడుడు, సైన్యనాథాః = విష్వక్సేనుడును, తథా+ఏవ = ఆ విధముగానే, కుముద+ఆదయః = కుముదుడు మొదలగువారు, నగరగోపురద్వారపాః = నగరపాలకులు, ద్వారపాలకులు, (చండప్రచండాదులు), అచింత్యబలవిక్రమాః = ఊహింప సాధ్యము కాని బలపరాక్రమములను కలవారై, రంగసంరక్షకాః = శ్రీరంగమును (మొదలగు క్షేత్రములను) రక్షించువారై, జితంత ఇతి వాదినః = "జితం తే" అను మంత్రమును ఎల్లప్పుడు పల్కుచున్నవారై, త్వమ్ ఇవ = నీవలె, జగదనుగ్రహే =లోకమును అనుగ్రహించుటలో, జాగ్రతు = మేల్కొని యుందురుగాక !

అధికబలపరాక్రమములను కల్గియున్న ఆదిశేషుడు, గరుడుడు, విష్వక్సేనుడు, కుముదుడు- మొదలగు ద్వారపాలకులు, నగరపాలకులు మొదలగువారు అందఱు శ్రీరంగమును రక్షించువారై, "జితం తే" అను మంత్రమును ఎల్లప్పుడు పఠించువారై నీవలె లోకమును కాపాడుటలో జాగరూకులై యుండవలెనని తాత్పర్యము.

**(అచింత్యబలవిక్రమాః)** - అచింత్యాద్భుతబలపరాక్రమములను కల్గినవారగు,

**(జితం త ఇతి వాదినః)** - "జయత్యతిబలో రామో లక్ష్మణ శ్చ మహాబలః" అనునట్లు "జితం తే పుండరీకాక్ష నమ స్తే విశ్వభావన" అను మంత్రమును పల్కువారై,

**(త్వ మివ జగదనుగ్రహే జాగ్రతుః)** - నీవలె లోకానుగ్రహమందు సావధానులై యుందురుగాక. శత్రునిరసనమును చేసిన రాజు తాను, స్వసైన్యమును నగరము కావలిగా యుండునట్లు, నీవును, పార్షదాదులును తిరిగి శత్రువులు ఆక్రమింపకుండ నుండునట్లు సావధానముగా నుండవలెనని భావము.

అవ :- ఇట్లు నేను శత్రునిరసనమును చేసి మిమ్ములను రక్షింపదొడగినచో ఇంద్రాదిదేవతలు మిమ్ములను శత్రువుల పాలుచేసి, నేను రక్షింపకుండునట్లు చేసినచో ఏమి చేయవలెను? అనినచో, నీవు ఆశ్రితవిరోధులను నిగ్రహింప ప్రారంభించినచో, వారికి చేయూతనిచ్చుటకు దేవతాంతరములకు శక్తి కలదా ? నీవు బాణాసురునితో యుద్ధమును చేయునపుడు "నేర్ శరిన్దాన్ కొడిక్కోళికొణ్డాన్" అను సూక్తిని బట్టి జయముకొఱకు ధ్వజమును కట్టుకొని వచ్చిన సుబ్రహ్మణ్యస్వామి మొదటనే ఓడింపబడెను. అభివృద్ధతేజస్సునుకల అగ్నియు ఓడెను. త్రినేత్రుడును పరాజయవ్రీడవలన అవకుంఠితుడై వెడలెను. "స పిత్రా చ పరిత్యక్తః" అని విమతుడగు కాకాసురుని విషయమునందు ఇంద్రాదులును రక్షణమందు అసమర్థులై పోయిరి. కావున నీవు నిగ్రహింప గోరినచో, రక్షించువారెవ్వరును లేరు. ఎవనినైన రక్షింపగోరినచో వానికి ఎవరివలనను సర్వదేశ-సర్వకాల- సర్వావస్థలయందు భయము ఉండదు. కావున ప్రభువగు నీవు ప్రతిభటశమనము చేయవలెననుచు, పులికి భయపడి పరుగెత్తువాడు "పులిని చంపుడు" అని పలు మార్లు ఎలుగెత్తి పిలచునట్లు శ్లోక మంతయు 'శమయ' అనుచున్నారు.

**విధి స్త్రిపురమర్దన స్త్రిదశపుంగవః పావకో**
**యమప్రభృతయోఽపి య ద్విమతరక్షణే న క్షమాః ।**

రిరక్షిషతి యత్ర చ ప్రతిభయం న కించిత్ క్వచిత్
స నః ప్రతిభటాన్ ప్రభో శమయ రంగధామాదికే॥ 26 ॥

ప్రభో = ప్రభూ!, విధిః = బ్రహ్మ, త్రిపురమర్దన = త్రిపురారి అగు శివుడు, త్రిదశ పుంగవః = దేవేంద్రుడు, పావకః = అగ్ని, యత్ = ఏ నీయొక్క, విమతరక్షణే = శత్రువును రక్షించుటలో, న క్షమాః = శక్తులు కారో, యత్ర చ = ఏ నీవు, రిరక్షిషతి చ= (ఒకనిని) రక్షింపవలెనని సంకల్పించినపుడు, (తస్య = అతనికి), క్వచిత్ = ఏచోట అయినను, కించిత్ = కొంచమైన, ప్రతిభయం = భయంకరముగా, న = అగుట లేదో, సః= అట్టి నీవు, నః = ఆశ్రితులగు మా, ప్రతిభటాన్ = విరోధులను, రంగధామాదికే = శ్రీరంగముమొదలగు దివ్యదేశములందు, శమయ = నశింపచేయుము.

బ్రహ్మమొదలగు సర్వదేవతలును నీవు నిగ్రహింపవలెనని సంకల్పించిన వ్యక్తిని రక్షించుటలో సమర్థులు కారు. నీవు రక్షింప సంకల్పించిన పురుషునకు ఏ వస్తువు ఏ చోట భయమును కల్గింపలేదు. అట్టి నీవు శ్రీరంగము మొదలగు దివ్యదేశములలో నిన్ను ఆశ్రయించిన భక్తులను నిన్ను సేవింపకుండ అడ్డుపడు విరోధులను నివర్తింప చేయుము.

(విధిః) - బ్రహ్మ

(త్రిదశమర్దవః) - రుద్రుడు,

(త్రిదశపుంగవః) ఇంద్రుడు

(యమప్రభృతయః అపి) - యముడు మొదలగు దేవతలందఱు.

(యద్విమతరక్షణే వ క్షమాః) - నీకు అభిమతము కానివానిని రక్షించు విషయమునందు సమర్థులు కారు. బ్రహ్మాదులగు దేవతలు అందఱు కలసివచ్చినను నీకు విమతుడగువానిని రక్షించుటలో సమర్థులు కారని భావము. ఈ అర్థమును "బ్రహ్మా స్వయంభూ శ్చతురాననో వా రుద్ర స్త్రినేత్ర స్త్రిపురాంతకో వా", "స పిత్రా చ పరిత్యక్తః" ఇత్యాది సూక్తులతో వాల్మీకి భగవానుడు తెలిపెను.

(యత్ర చ) - ఎట్టి నీవు,

(రిరక్షిషతి) - ఏప్రాణిని రక్షింపగోరుచున్నావో, అతనికి,

(కించిత్) - ఏ వస్తువైనను,

(వ ప్రతిభయమ్) - భయంకరము కాదు. "భయంకరం ప్రతిభయమ్" అని

అమరము. ప్రహ్లాదునకు మహాభయంకరములగు సర్పాగ్ని. విషాదులు ఏవియు భయంకరములు కాలేదు కదా!

(ప్రభో) - ప్రభువుకు ప్రజారక్షణము ధర్మముకదా !

(ప వః ప్రతిభటాన్) - నీవు మా శత్రువులను, శ్రీరంగమున నిన్ను సేవింపనీయకుండ ప్రతిబంధించుచున్న తురుష్కలు మొదలగువారిని- అని భావము.

(రంగధామాదికే శమయ) - శ్రీరంగము మొదలగు క్షేత్రములలో ఉపశమింప చేయవలెను.

అవ :- తిరిగి నీవలననే జగద్రక్షణము జరుగవలెనని ప్రార్థించుచున్నారు.

స కైటభతమోరవి ర్మధుపరాగజంఝామరుత్
హిరణ్యగిరిదారణః త్రుటితకాలనేమిద్రుమః ।
కి మత్ర బహునా భజద్భవపయోధిముష్టింధయః
త్రివిక్రమ భవత్క్రమం క్షిపతు మంక్షు రంగద్విషః ॥ 27 ॥

త్రివిక్రమ = త్రివిక్రమస్వామీ !, కైటభ = కైటభుడను, తమః = చీకటికి, రవిః = సూర్యుడు, మధు = మధువను, పరాగ = ధూళికి, జంఝామరుత్ = గొప్ప వాయువు, హిరణ్య= హిరణ్యాసురుడను, గిరి = పర్వతమును, దారణః = పగులగొట్టు వజ్రమువంటిది, త్రుటిత= విరచిన, తెంపిన, కాలనేమి = కాలనేమి అను, ద్రుమః = వృక్షమును కల్గినది, అత్ర బహునా కిమ్ = నీ ఆశ్రితవిరోధినిరసన విషయమున పలు మాటలతో ఏమి పని?, భజత్ = భజించువారి, భవపయోధి = సంసార మను సముద్రమును, ముష్టింధయః = పిడికిలితో గ్రసించు శక్తిని కల, సః = ఆ, భవత్క్రమః = నీ పరాక్రమము, మంక్షు = శీఘ్రముగా, రంగద్విషః = శ్రీరంగక్షేత్రమునకు విరోధులను, క్షిపతు = నివర్తింపచేయునుగాక !

త్రివిక్రమా ! కైటభాసురుడను చీకటికి సూర్యునివంటిది, మధువను ధూళికి సుడిగాలివంటిది, హిరణ్యాసురుడను పర్వతమును పగులగొట్టునది, కాలనేమి అను వృక్షమును విఱచినది అగు వాచామగోచరమైన శక్తిని కల నీ విక్రమము శీఘ్రముగా శ్రీరంగక్షేత్రవిరోధులను నశింపచేయునుగాక !

(కైటభతమోరవిః) - కైటభాసురుడను చీకటికి సూర్యునివంటిది అగు. సూర్యుని

చూచినచో చీకటి తనకు తానే దూరమగును. అట్లే నీ పరాక్రమమును చూచి కైటభుడు తనకుతానే పరుగెత్తుకొని పోయెనని భావము.

(మధుపరాగజంఝామరుత్) -జంఝామరుత్తు ముందుగల ధూళి ఉన్నచోటున ఉండక ఎగిరిపోవునట్లే మధువను అసురుడు ఎగిరిపోయెనని తాత్పర్యము.

(హిరణ్యగిరిదారణః) - "ఇరణియన్ నెఞ్జై యిరు పిళవాక మున్ కీణ్డ" అనునట్లు హిరణ్యకశిపుని రెండుగా చీల్చెనని భావము.

(త్రుటితకాలనేమిద్రుమః) - ఖండింపబడిన కాలనేమి అను వృక్షమును కల్గినది.

(అత్ర బహునా కిమ్) - ఆశ్రితవిరోధినిరసన విషయమునందు పలు మాటలు పల్కుటేల ?

(భజద్భవపయోధిముష్టింధయః) - ఆశ్రితుల సంసారమే పయోధి. దానిని ముష్టితో, అనగా- పుడిసిలితో తాగువాడు. "భజతాం ఆశ్రితానాం భవ ఏవ పయోధిః, తస్య ముష్టింధయః చులుకీకృత్య పాతుం సమర్థః" అని వివరణము. ఆశ్రితవిరోధియగు ఒక్కొక్క అసురుని నిరాకరించెనని పలు మాటలు చెప్పి ఏమి ప్రయోజనము? ఆశ్రితవిరోధియగు సంసారమను సముద్రమును అరచేతిలో అణచి, "అచ్యుతాయ నమః" అను రీతిలో గ్రసించు విధమును కల్గినది నీ విక్రమము అని భావము.

(త్రివిక్రమ) - ఆశ్రితవిరోధినిరసనార్థమైకదా త్రివిక్రమావతారమును నీవు ఎత్తితివి.

(సః భవత్ క్రమః) - అట్టి నీ విక్రమము. క్రమ మనగా పరాక్రమము

(రంగద్విషః) - శ్రీరంగక్షేత్రశత్రువులను. వారు శ్రీరంగవాసులను బాధించి తఱుముటయేకాక, క్షేత్రమును వేఱుగా మార్చుటకు ప్రయత్నించినవారని తాత్పర్యము.

(మంక్షు క్షపయ) - శీఘ్రముగా నివారింపవలెను.

అవ :- ఇంతవరకు శ్రీరంగము మొదలగు దివ్యదేశములకు, ఆ దివ్యదేశములలో వసించు పరమైకాంతులకును హితము జేయ ప్రార్థించిరి. ఇందు స్వస్వరూపానుగుణఫలమును ప్రార్థించుచున్నారు.

యతిప్రవరభారతీరసభరేణ నీతం వయః
ప్రఫుల్లపలితం శిరః పర మిహ క్షమం ప్రార్థయే ।

నిరస్తరిపుసంభవే క్వచన రంగముఖ్యే విభో
పరస్పరహితైషిణాం పరిసరేషు మాం వర్తయ ॥ 28 ॥

విభో = ప్రభూ !, యతిప్రవర = భగవద్రామానుజుల, భారతీ = సూక్తుల, రస = రసముయొక్క, భరేణ = అనుసంధానముతో, వయః = వయస్సు, నీతమ్ = గడుపబడినది, శిరః = శిరస్సు, ప్రఫుల్ల = బాగుగా పూచిన పూవువలె, పలితం = తెల్లబడినది, పరం = ఇకపై, క్షమం = స్వరూపానుగుణమైనదానిని, ప్రార్థయే = ప్రార్థింతును. నిరస్తరిపుసంభవే = నిరసింపబడిన శత్రువుల ఉత్పత్తినికల, రంగముఖ్యే= శ్రీరంగముమొదలగు, క్వచన = ఏదియో ఒకానొక దివ్యదేశమున, పరస్పరహితైషిణాం= ఒకరికి వేఱొకరు హితమును కోరుకొనువారి, పరిసరేషు = సమీపములలో, మాం = నన్ను, వర్తయ = నివసింపనీయుము.

శ్రీభాష్యాది కాలక్షేపముచే నా యౌవనమును గడపితిని. ఇపుడు జరచే ఆక్రమింపబడినవాడనైతిని. కాలక్షేపములకు శక్తి లేదు. "అత్రైవ శ్రీరంగే సుఖమాస్వ" అని నీవు నియమించునట్లు శ్రీరంగమునందునే నుండి నిన్ను అనుభవించునట్లు విరోధులగు తురుష్కాదులను నిరసించి, పరస్పరము హితమును కోరువారి సన్నిధిలో నేను ఉండునట్లును చేయుము.

(యతిప్రవరభారతీరసభరేణ) - భగవద్రామానుజుల సూక్తి రసముయొక్క అనుభవముచే. శ్రీరామానుజుల శ్రీభాష్యదీపాదిసూక్త్యర్థరసానుభవముచే -అని భావము.

(వయః నీతమ్) - నాచే- అని అధ్యాహార్యము

(శిరః ప్రఫుల్లపలితమ్) - వికసితమై, జరచే శుక్లమై యున్నది.

(పరమ్) - ఇకపై.

(ఇహ క్షమమ్) - ఈప్రకృతిలో యోగ్యమైనదానిని.

(ప్రార్థయే) - ప్రార్థించుచున్నాను. అది ఏమనగా.

(నిరస్తరిపుసంభవే) - నిరసింపబడిన శత్రువుల ఉత్పత్తిని కల్గిన-

(రంగముఖ్యే క్వచన)- శ్రీరంగము మొదలగు ఒకానొక క్షేత్రమునందు.

(పరస్పరహితైషిణామ్ పరిసరేషు మాం వర్తయ)- అన్యోన్యము హితచింతను చేయువారి పరిసరములలో నన్ను ఉంచుము. ఇచట "అయ మైంద్రీముఖం పశ్య రక్త

ఘ్చుంబతి చంద్రమాః" అనునట్లు ఒక రాజకుమారుని శృంగారరసానుభవముచే యౌవనము గడుపబడినదను అర్థాంతరము స్ఫురించుచున్నది. కావున సమాసోక్తి కలదు. తమకు భగవద్రామానుజుల సూక్త్యనుభవముచే వయస్సు గడుపబడినదనియు, అన్యులకు విషయానుభవముచే వయస్సు చెల్లినదనియు సూచింపబడినది.

అవ :- ఈ శ్లోకమునందు ప్రబంధముయొక్క విషయప్రయోజనములను తెలుపగోరి, తాము ప్రార్థించినట్లే స్వామి అభయప్రదానము చేసి రక్షించును- అను అర్థమును సూచించుచు, మీరును ఈ స్తోత్రమును పఠింపుడు అని తురుష్కాదులవలన పీడితులైనవారిని ఉద్దేశించి పల్కుచు ముగించుచున్నారు.

ప్రబుద్ధగురువీక్షణప్రథితవేంకటేశోద్భవాం
ఇమా మభయసిద్ధయే పఠత రంగభర్తుః స్తుతిమ్ ।
భయం త్యజత భద్ర మిత్యభిదధత్స వః కేశవః
స్వయం ఘనఘృణానిధిః గుణగణేన గోపాయతి ॥ 29 ॥

ప్రబుద్ధ = గొప్పజ్ఞానమునుకల, గురు = ఆచార్యుల, వీక్షణ = విశేషకటాక్షముచే, ప్రథిత = ప్రశస్తిని పొందిన, వేంకటేశోద్భవాం = శ్రీవేంకటేశులను పేరుగల వేదాంతదేశికులవలన జనించినది, రంగభర్తుః = శ్రీరంగనాథునియొక్క, ఇమాం = ఈ, స్తుతిం =స్తోత్రమును, అభయసిద్ధయే = అభయమును పొందుటకొఱకు, పఠత= పఠింపుడు, ఘనఘృణానిధిః = గొప్ప దయానిధియగు, సః కేశవః = ఆ కేశవస్వామి, భయం = భయమును, త్యజత = విడువుడు, భద్రం = క్షేమము (కల్గుగాక) ఇతి = అని, అభిదధత్ = పల్కువాడై, గుణగణేన = సద్గుణసమూహముతో, స్వయం = స్వయముగా, వః = మనలను, గోపాయతి = రక్షించును.

పెద్దలగు ఆచార్యుల కటాక్షవిశేషముచే ప్రసిద్ధులగు దేశికులు రచించిన ఈ స్తుతిని పఠించుడు. భగవానుడు "భయమును విడువుడు, శుభము కల్గును" అనుచు తన సద్గుణములతో తానే స్వయముగా మిమ్ములను రక్షించును.

(ప్రబుద్ధగురువీక్షణప్రథితవేంకటేశోద్భవామ్) - ప్రబుద్ధజ్ఞానులలో గొప్పవారగు, గురువుల- ఆచార్యుల అని అర్థము. ఇచట గురుశబ్దముచే అప్పుళ్లార్, వరదాచార్యులను, తండ్రియగు అనంతసూరిని సూచించిరి. "గురుభ్య శ్చ తద్గురుభ్య శ్చ నమోవాకం ప్రశాస్మహే" అనునపుడు గురుశబ్దబహువచనముచే వాదిహంసాంబువాహ- వరదాచార్య,

అనంతసూరులు తెలుపబడిరని వ్యాఖ్యానింపబడినది. ఇట్టి గురుత్రయముయొక్క, వీక్షణ- కటాక్షవిశేషముచే, ప్రథిత - ప్రసిద్ధులగు వేంకటేశోద్భవాం = వేదాంతదేశికులవలన పుట్టిన- అని భావము. ఇందుచే "మా నిషాద ప్రతిష్ఠాం త్వమ్" అను శ్లోకము ఋషిప్రయత్నము లేకుండగనే వృత్తాదులచే పరిపూర్ణముమై ఉత్పన్నమైనట్లు, ఆళ్వార్ల ప్రయత్నము లేకనే ద్రావిడలక్షణ-గానలక్షణములతో తిరువాయ్‌మొళి ఉత్పన్నమైనట్లు ఈ స్తుతి ఉత్పన్నమైనదని సూచింపబడినది.

(రంగభర్తు: ఇమాం స్తుతిమ్) - శ్రీరంగనాథుని విషయమైన ఈ స్తుతిని.

(అభయసిద్ధయే)- అభయసిద్ధికొఱకు-

(పఠత) - పఠింపుడు. అర్థజ్ఞానపర్యంతము అవసరము లేదు. శబ్దమాత్రమునైనను పఠింపుడు. "పఠత" అని తురుష్కయవనాది భీతులగు సాధువులను ఉద్దేశించి పల్కిరి. భయనివృత్తికొఱకు ఉపాయరూపమున, స్వయంభోగ్యరూపముననను పఠింపుడు- అని భావము. మీకును భయాభయనివృత్తి కలుగవలెనని నేను- "శ్రియ: పరిబృఢే త్వయి" అను శ్లోకమునందు "సమర్పితోఽయం జన:" అని ప్రపత్తిని చేసితిని. అందులకు స్వామి "మా భైషీ:" అని పల్కి, మిమ్ములను రక్షింపదొడగెను. ఆ రక్షణము శాశ్వతమగుటకు "తవ భరోఽహ మకారిషి ధార్మికై శ్శరణ మిత్యపి వాచ ముదైరిరమ్" అనునట్లు నేను ప్రార్థించితిని. మీరును ప్రార్థింపుడు- అని తాత్పర్యము.

(భయం త్యజత) - తురుష్కాదులచే కల్గిన భయమును వీడుడు.

(భద్రం)- క్షేమము కల్గుగాక !

(ఇత్యభిదధత్) - అని పల్కుచు

(కేశవ:) - కేశిహంతయగువాడు. కేశి అను అసురుని నిరసించినట్లే యవనాదులను నిరసించునని అర్థము.

(స:) - ఆ పరమపురుషుడగు స్వామి

(ఘనఘృణానిధి:) - నిబిడమైన దయకు స్థానమైనవాడు. పరమదయాళువని భావము.

(గుణగణేన స్వయం గోపాయతి) - వాత్సల్యాది గుణబృందముచే తానే మిమ్ములను రక్షించును. "వ:" అను బహువచనముచే "భవేయం శరణం హి వ:" అని

త్రిజటాసంబంధులగు మిగిలిన రాక్షసస్త్రీలను ఉద్దేశించి సీతాదేవి పల్కినట్లు యవనాదిభీతులైన సాధువులను అందఱిని చూచి దేశికులు పల్కిరని తెలియుచున్నది. "గుణగణేన" అనుటచే "కరగ్రహణదీక్షితాః క ఇహ తేవ దివ్యా గుణాః" అనునట్లు సకల గుణములును ఆశ్రితరక్షణమునందు జాగరూకములై యున్నవని పూర్వము తెలిపిన అర్థమును స్థిరీకరించిరి. "స్వయమ్" అనుటచే శత్రువులను సేవకులద్వారా నిగ్రహింపక, వాత్సల్యగుణములు లోకమునకు ప్రకాశించునట్లు తానే వచ్చి నిగ్రహించుచున్నాడు అను అర్థము వ్యక్తము. "ఘనఘృణానిధిః" అనుటచే పూర్వము "అవతి వత్సలా త్వద్దయా" అని పల్కిన అర్థమును స్థిరీకరించిరి.

ఇట్లు దేశికులు ప్రార్థించినట్లే యవనతురుష్కపాషండాదులను భగవానుడు నిరసింపగా, పిమ్మట తాము రచించిన ప్రబంధమగు భగవద్ధ్యానసోపానమునందు పాదాదికేశాంతముగా శ్రీరంగనాథుని అనుభవించిరి.

ఋఋఋ